# బాలవ్యాకరణము

## సంజ్ఞా సంధి పరిచ్ఛేదములు



పరవస్తు చిన్నయసూరి

“శ్రీ లతకుం బ్రాఁకయి వృష
శైలంబున వెలసి తనదు చాయ కెలయు ధ
న్యాళి దగ మాన్పి కోర్కులు
చాలంగా నొసఁగు కల్పసాలముఁ గొలుతున్.

అనయము లలితోక్తులతో
నొనరుపడం గూర్చి లక్ష్యయోజన మొప్పం
గను బాలవ్యాకరణం
బనఁగా లక్షణ మొనర్తు నాంధ్రంబునకున్.

దిక్ప్రదర్శనముగఁ దెలిపెద నిందు ల
క్షణము గానఁ బూర్వకవుల లక్ష్య
ములను లాఁతిలక్ష్యములఁ గాంచి తక్కుల
క్షణ మెఱింగికొనుఁడు చతురమతులు.”

# విషయసూచిక

శ్రీ

శ్రీ హయగ్రీవాయ నమః

# బాలవ్యాకరణము

## సంజ్ఞాపరిచ్ఛేదము

1. సంస్కృతమునకు వర్ణము లేఁబది.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః॥ క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ శ ష స హ ళ.

ఇందకారాదు లచ్చులు. కకారాదులు హల్లులు. అజ్ఝల్విభాగ మిూలాగుననే మీఁద నెఱుంగునది.

2. ప్రాకృతమునకు వర్ణములు నలువది.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఏ ఓ అం అః॥ క ఖ గ ఘ చ ఛ జ ఝ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ స హ ళ. కొందఱమతంబున హ్రస్వవక్రంబులును బ్రాకృతంబునందుఁ గలవు. కొందఱమతంబున వక్రతమంబులుం గలవు; ఎ ఏ ఒ ఓ లు వక్రము లని, ఐ ఔ లు వక్రతమము లని ప్రాచీనులు వ్యవహరింతురు.

3. తెనుఁగునకు వర్ణములు ముప్పదియాఱు.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అః క గ
చ చ జ జ ట డ ణ త ద న ప బ మ య ర ల వ స హ ళ.

4. ఋ ౠ ఌ ౡ విసర్గ ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ ఙ ఞ శ ష లు సంస్కృతసమంబులను గూడి తెలుఁగున వ్యవహరింపంబడు.

ఋతువు — పితౄణము — క్లుప్తము — ౡకారము — దుఃఖము — ఖడ్గము — ఘటము — ఛత్రము — ఝురము — కంఠము — ఢక్క — రథము — ధరణి — ఫణము — భయము — వజ్ర్త్ర — ఆజ్ఞ — శరము — షండము.

5. కచటతపలు పరుషంబు లని గజడదబలు సరళంబు లని చెప్పంబడు.

6. ఇతరము లగు హల్లులు స్థిరములు.

ఖ ఘ ఙ ఛ ఝ ఞ ఠ ఢ ణ థ ధ న ఫ భ మ య ర ల వ శ ష స హ ళ.

7. దంత్యతాలవ్యంబు లయిన చ జ లు సవర్ణంబులు.

తాలవ్యచకారంబు దంత్యచకారంబునకును, తాలవ్య జకారంబు దంత్య జకారంబునకును, గ్రాహకము లని తాత్పర్యము.

8. ఇ ఈ ఎ ఏ లం గూడిన చ జ లు తాలవ్యంబులు.

చిలుక - చీమ - చెలి - చేమ - జిల - జీడి - జెట్టి - జేజే.

9. అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ లం గూడిన చ జ లు దంత్యంబులు.

చలి - చాప - చుక్క - చూపు - చొక్క - చోటు - చౌక - జముఁడు - జాతర - జున్ను - జూలు - జొన్న - జోలి - జౌకు. ఐదంతము లయిన చ జ లు సమేతరశబ్దములందు లేవు.

10. సంస్కృతసమంబులం దికారాంతము లయిన శబ్దముల యుపధా చ జ లు బహువచనంబు పరం బగునపుడు దంత్యము లగును.

ఇవితప్ప సంస్కృతసమంబులందు దంత్య చ జ లు లేవని తాత్పర్యము. ఉపధ యనఁగాఁ దుదివర్ణమునకు ముందు వర్ణము. అర్చి - అర్చులు; రోచి - రోచులు; వీచి - వీచులు; రాజి - రాజులు; వాజి - వాజులు. మఱియు రాజు శబ్దం బొక్కటి దంత్యయుక్తంబు కానంబడియెడి. ఇతరము లయిన చ జ ల కుదాహరణములు: చంద్రుఁడు - చామరము - చక్రిక - చూర్ణము - చోరుఁడు - చౌర్యము - జయము - జాతి - జుగుప్స - జూటము - ఇత్యాదులు.

11. నకారంబు ద్రుతంబు.

12. ద్రుతాంతము లయిన పదములు ద్రుతప్రకృతికములు.

ప్రథమా కయి పట్టి యొక్కేతరము లయిన విభక్తులు - ఉత్తమపురుషైకవచనంబులు - భూత తద్ధర్మాద్యర్థక ప్రథమ పురుషైకవచనంబులు - ఆశీరాద్యర్థంబు లయిన యెడు త వర్ణ కంబులు - శతృతుమానంతర్య చేదాద్యర్థకంబులు - నేను తాను పదంబులును - పలె ప్రభృతులును ద్రుతప్రకృతికంబులు. నన్నున్ - నాచేతన్ - నాతోడన్ - నాకొఱకున్ - నావల నన్ - నాకంటెన్ - నాకున్ - మాలోపలన్ - మాయం దున్. వత్తున్ - వచ్చెదన్. వచ్చెన్ - వచ్చున్ - వచ్చెడున్. ప్రసన్నులయ్యెడున్ - కావుతన్ - కొట్టుచున్ - కొట్టన్ - కొట్టఁగన్ - కొట్టుడున్ - కొట్టినన్. పలెన్ - ఎంతయున్ - పోలెన్ - అయ్యున్ - ఇత్యాదు లూహ్యంబులు.

13. ద్రుతప్రకృతులు గానిశబ్దంబులు కళ లనంబడు.

రాముఁడు - రాములు - హయము - విష్ణువు - గోడ - మేడ - అయ్యా - అమ్మ - రామునికయి - జ్ఞానముఁబట్టి - నాయొక్క - వచ్చిరి - వచ్చితివి - వచ్చితిరి - వచ్చితిమి - రాఁడు - రారు - రాదు - రావు - రాము - కొట్టక - తిట్టక - ఎత్తిలి - ఒత్తిలి - ఊరక - మిన్నక - బళి - అక్కట - ఏల - ఇత్యాదు లూహించునది.

14. హ్రస్వముమీఁది ఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగ నగు.

అడఁకువ - అడంకువ - అరఁటి - అరంటి - ఎఱుఁగుట - ఎఱుంగుట - బలఁగము - బలంగము - మగఁటిమి - మగంటిమి.

15. దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు.

వాఁడు - వీఁడు - రాఁడు - లేఁడు - కాఁబోలు - కాఁబట్టి - గోఁగులు - రేఁగులు.

16. సంస్కృత సమేతరము లయిన తెలుఁగు శబ్దముల యందుఁ బరుషసరళంబులకు ముందే బిందువు కానంబడుచున్నది.

వంకర - కలఁకువ - మంచు - త్రాఁచు - దంట - దాఁటు - కొంత - కోఁత - ఇత్యాదు లూహ్యంబులు.

17. యకారంబును వు వూ వొ వో లును దెలుఁగు మాటలకు మొదట లేవు.

ఎవఁడు - ఎక్కడ - ఏమి - ఏల - ఉండ - ఊరు - ఒకఁడు - ఓడ. హరియతఁడు - నిద్రవోయె నిట్టిచోట్ల సంధి వశంబున వచ్చిన యకార వకారంబులు గాని పూర్వసిద్ధంబులు గావు; వోఢృ వోఢవ్య శబ్దములు దప్ప సంస్కృత సమంబులందుసహితము వు వూ వో వర్ణాదు లగు శబ్దంబులు లేవని యెఱుంగునది. ఉదకము - ఊర్మిక - ఓదనము.

(18) యరలవలు లఘువు లని యలఘువు లని ద్వివిధంబు లగు.

హరియతఁడు - ఇత్యాదులం దాగమ యకారము లఘువు. తక్కిన యకార మలఘువు. విఱుఁగు మెఱుఁగిత్యాదులందు రేఫం బలఘువు. ఇదే శకటరేఫ మని చెప్పఁబడును. శకటరేఫము తత్సమ తద్భవములందు లేదు. పెరుగు కరు గిత్యాదులందు రేఫంబు లఘువు. ఏళులు పాళులు త్రాళు లని బహుత్వమందు రలడల కాదేశ మయిన ళకార మలఘువు. తల - నేల యిత్యాదులందలి లకారము లఘువు. అతఁడు వలికె నిత్యాదులందున్న పాదేశ వకారము లఘువు. తక్కిన వకార మలఘువు. వర్ణసమామ్నాయమందలి ళకారము వర్ణాంతరము గాని యలఘు ళకారము గాదని యెఱుంగునది.

19. సంస్కృత ప్రాకృతతుల్యం బగు భాష తత్సమంబు.

| సంస్కృతము | సంస్కృతసమము |
|---|---|
| రామః | రాముఁడు |
| విద్యా | విద్య |
| హరిః | హరి |
| ధేనుః | ధేనువు |
| భూః | భువి |
| పితా | పిత |

| | |
|---|---|
| గౌః | గోవు |
| నౌః | నావ |
| ద్యౌః | దివి |
| హృద్ | హృది |
| జగత్ | జగత్తు<br>జగము |

ఇత్యాదు లూహ్యంబులు.

| సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృతసమము |
|---|---|---|
| అగ్నిః | అగ్గీ | అగ్గి |
| ఆటిః | ఆడీ | ఆడి |
| ఆలిః<br>పఙ్క్తి | ఓలీ | ఓలి |
| కటుః | కారో | కారము |
| గౌరవమ్ | గారవం | గారవము |
| జటా | జడా | ౙడ |
| మిరా | మేరా | మేర |
| యమః | జమో | ౙముఁడు |
| రాజ్ఞీ | రాణీ | రాణి |
| శృఙ్గారః | సింగారో | సింగారము |
| శ్రీః | సిరీ | సిరి |

ఇత్యాదు లెఱుఁగునది.

20. సంస్కృత ప్రాకృతభవం బగుభాష తద్భవంబు.

| సంస్కృతము | సంస్కృతభవము |
|---|---|
| ఆకాశః | ఆకసము |
| కుడ్యమ్ | గోడ |
| చన్ద్రః | చెందురుఁడు |
| తమఙ్గః | తమగము |
| తామరసమ్ | తామర |
| నారాచః | నారసము |
| నిభః | నెపము, నెవము |
| ముఖమ్ | మొకము, మొగము |
| మృగః | మెకము, మెగము |
| వక్రః | వంకర |
| వేసరః | వేసడము |
| సముద్రః | సంద్రము |
| సూచీ | సూది |
| స్మరః | మరుఁడు |
| హారణమ్ | అరణము |
| హరితాళమ్ | హరిదళము |

ఇత్యాదులు గ్రహించునది.

| సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృతభవము |
| --- | --- | --- |
| అఙ్గారః | ఇంగాలో | ఇంగలము |
| అప్సరాః | అచ్ఛరా | అచ్చర |
| ఆశ్చర్యమ్ | అచ్ఛేరం | అచ్చెరువు |
| పఞ్చాశత్ | పణ్ణాసా | పనస |
| పృథివీ | పుఢవీ | పుడమి |
| ప్రయాణమ్ | పయాణం | పయనము |
| ప్రవాళః | పవాళో | { పవడము<br>పగడము |
| మత్సరః | మచ్ఛరో | మచ్చరము |
| యజ్ఞః | జణ్ణో | జన్నము |
| లక్ష్మీః | లచ్ఛీ | లచ్చి |
| విష్ణుః | విణ్ణూ | వెన్నుఁడు |
| వైద్యః | వెజ్జో | వెజ్జు |
| స్తమ్భః | ఖంభో | కంబము |
| స్థూలమ్ | థోరమ్ | తోరము |

ఇత్యాదులు తెలియునది.

✓21. త్రిలింగదేశవ్యవహారసిద్ధం బగు భాష దేశ్యంబు.

ఊరు - పేరు - ముల్లు - ఇల్లు - కోట - పేట - దూడ - మేడ - కోఁత - లేఁత - తావి - మోవి - ఇత్యాదు లరయునది.

22. లక్షణవిరుద్ధం బగు భాష గ్రామ్యంబు.

వస్తాఁడు - తెస్తాఁడు - వచ్చేవి - తెచ్చేవి - వచ్చేవాఁడు - తెచ్చేవాఁడు - వచ్చేటివాఁడు - తెచ్చేటివాఁడు - ఈభాష ప్రయోగంబున కనర్హంబు.

23. ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు.

పెద్దలు వ్యవహరించినమాట గ్రామ్యం బయిన గ్రహింపం దగు నని తాత్పర్యము. కఱకంఠుఁడు-ప్రాణగొడ్డము-జీవగఱ్ఱ - కపిలకన్నులు - కపిలగడ్డము - కపిలజడలు.

---

## సంధిపరిచ్ఛేదము

1. ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు.

పూర్వపరస్వరంబులకుం బరస్వరం బేకాదేశం బగుట సంధి యనంబడు.

రాముఁడు + అతఁడు = రాముఁడతఁడు
సోముఁడు + ఇతఁడు = సోముఁడితఁడు
మనము + ఉంటిమి = మనముంటిమి
అతఁడు + ఎక్కడ = అతఁడెక్కడ
ఇతఁడు + ఒకఁడు = ఇతఁడొకఁడు

2. ప్రథమేతర విభక్తి శత్రర్థ చు వర్ణంబులం దున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగు.

| | | | | |
|---|---|---|---|---|
| నన్నున్ | + | అడిగె | = | నన్నడిగె<br>నన్నునడిగె |
| నాకొఱకున్ | + | ఇచ్చె | = | నాకొఱకిచ్చె<br>నాకొఱకునిచ్చె |
| నాకున్ | + | ఆదరువు | = | నాకాదరువు<br>నాకునాదరువు |
| నాయందున్ | + | ఆశ | = | నాయందాశ<br>నాయందునాశ |
| ఇందున్ | + | ఉన్నాఁడు | = | ఇందున్నాఁడు<br>ఇందునున్నాఁడు |
| ఎందున్ | + | ఉంటివి | = | ఎందుంటివి<br>ఎందునుంటివి |
| వచ్చుచున్ | + | ఉండెను | = | వచ్చుచుండెను<br>వచ్చుచునుండెను |
| చూచుచున్ | + | ఏగెను | = | చూచుచేగెను<br>చూచుచు నేగెను |

3. సంధి లేనిచోట స్వరంబుకంటెం బరం బయిన స్వరంబునకు యడాగమం బగు.

ఆగమం బనఁగా వర్ణాధిక్యంబు.

మా + అమ్మ = మాయమ్మ
మీ + ఇల్లు = మీయిల్లు
మా + ఊరు = మాయూరు

4. అత్తునకు సంధి బహుళముగా నగు.

మేన + అల్లుఁడు = { మేనల్లుఁడు / మేనయల్లుఁడు
పుట్టిన + ఇల్లు = { పుట్టినిల్లు / పుట్టినయిల్లు
చూడక + ఉండెను = { చూడకుండెను / చూడకయుండెను

బహుళగ్రహణముచేత స్త్రీవాచక తత్సమ సంబోధ నాంతంబులకు సంధి లేదు.

అమ్మ + ఇచ్చెను = అమ్మ యిచ్చెను
దూత + ఇతఁడు = దూత యితఁడు
చెలువుఁడ + ఇందము = చెలువుఁడ యిందము

సంస్కృతీయంబునకు సంధి యగు నని యథర్వణాచార్యులు చెప్పిరి గాని దానికిం బూర్వకావ్యంబులందుఁ బ్రయోగంబు మృగ్యంబు. ఆధునికకృతులం దొకానొకచోట స్త్రీవాచక తత్సమంబులకు సంధి కానంబడియెడు॥ గంగనుకాసె-నెలఁతిచ్చెను. వెలయాల్వాదుల సంధిలేమి బాహుళకము చేతనే యని యూహించునది.

✓5. ఏమ్యాదుల యిత్తునకు సంధి వైకల్పికముగా నగు.

ఏమి – మఱి – కి (షష్ఠి) – అది – అవి – ఇది–ఇవి–ఏది – ఏవి. ఇది యాకృతిగణంబు.

ఏమి + అంటివి = { ఏమంటివి / ఏమియంటివి

మఱి + ఏమి = { మఱేమి / మఱియేమి

హరికిన్ + ఇచ్చె = { హరికిచ్చె / హరికినిచ్చె

6. క్రియాపదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగా నగు.

వచ్చిరి + అప్పుడు = { వచ్చిరప్పుడు / వచ్చిరియప్పుడు

వచ్చితిమి + ఇప్పుడు = { వచ్చితిమిప్పుడు / వచ్చితిమియిప్పుడు

7. మధ్యమపురుషక్రియలయం దిత్తునకు సంధియగు.

ఏలితివి + అపుడు = ఏలితివపుడు

ఏలితి + ఇపుడు = ఏలితిపుడు

ఏలితిరి + ఇపుడు = ఏలితిరిపుడు

8. క్త్వార్థంబైన యిత్తునకు సంధి లేదు.

వచ్చి + ఇచ్చెను = వచ్చి యిచ్చెను.

9. ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదు.

ప్రథమేతరవిభక్తివిధి నిరవకాశంబు గావున దీనిని బాధించెడిని.

వచ్చున్ + ఇపుడు = వచ్చు నిపుడు
చూడన్ + అయితి = చూడనయితి
ఉండెడిన్ + అతఁడు = ఉండెడి నతఁడు

ఇఁక - ఇఁగ - ఎట్టకేలకు - ఎట్టకేని-ఈయవి యిఁకాదు లని యెఱుంగునది ; వీనికి సంధి వైకల్పికము.

10. అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు సంధి తఱుచుగ నగు.

ద్విరుక్తముయొక్క పరరూప మామ్రేడిత మనంబడు. తఱుచుగ ననుటచే నొకానొకచోట వైకల్పికసంధియుం గల దని తాత్పర్యము.

ఔర + ఔర = ఔరౌర
ఆహా + ఆహా = ఆహాహా
ఎట్టూ + ఎట్టూ = ఎట్టెట్టూ

ఓహో + ఓహో = ఓహోహో

ఏమి + ఏమి = { ఏమేమి / ఏమియేమి }

ఏగి యేగి యనుచో ౯ గ్వార్థం బగుట సంధి లేదు.

11. అంద్వవగాగమంబులు దప్ప నపదాదిస్వరంబు పరం బగునపు డచ్చునకు సంధి యగు.

మూఁడు + ఎండు = మూఁడేండు

వీసె + ఎండు = వీసేండు

అర్థ + ఇంచు = అర్థించు

నిర్జి + ఇంచు = నిర్జించు

అంద్వవగాగమంబులు పరంబు లగునపుడు యథాసంభవముగా గ్రహించునది. రాములందు - రాములయందు - హరియందు - ఎనిమిదవది - ఎనిమిదియువది.

12. కుఱు చిఱు కడు నడు నిడు శబ్దముల అడల కచ్చు పరం బగునపుడు ద్విరుక్త టకారం బగు.

కుఱు + ఉసురు = కుట్టుసురు

చిఱు + ఎలుక = చిట్టెలుక

కడు + ఎదురు = కట్టెదురు

నడు + ఇల్లు = నట్టిల్లు

నిడు + ఊరుపు = నిట్టూరుపు

13. ప్రథమమీఁది పరుషములకు గ స డ ద వ లు బహుళముగా నగు.

| | | | | |
|---|---|---|---|---|
| వాఁడు | + | కొట్టె | = | వాఁడు గొట్టె<br>వాఁడు కొట్టె |
| అపుడు | + | చనియె | = | అపుడు సనియె<br>అపుడు చనియె |
| నీవు | + | టక్కరివి | = | నీవు డక్కరివి<br>నీవు టక్కరివి |
| మీరు | + | తలఁడు | = | మీరు దలఁడు<br>మీరు తలఁడు |
| వారు | + | పోరు | = | వారు వోరు<br>వారు పోరు |

అప్పు డిప్పు డెప్పు డనుశబ్దములు నిత్యైకవచనాంతములు; వాగనుశాసనులు యదా తదా యని గ్రహించుట ప్రపంచార్థ మని యెఱుంగునది. ఈ కార్యము కళ లగు క్రియాపదములమీఁదసహితము కానంబడియెడిని.

| | | | | |
|---|---|---|---|---|
| రారు | + | కదా | = | రారు గదా<br>రారు కదా |
| వత్తురు | + | పోదురు | = | వత్తురు వోదురు<br>వత్తురు పోదురు |

14. తెనుఁగులమీఁది సాంస్కృతిక పరుషములకు గ స డ ద వ లు రావు.

| | | | | |
|---|---|---|---|---|
| వాఁడు | + | కంసారి | = | వాఁడు కంసారి |
| వీఁడు | + | చక్రపాణి | = | వీఁడు చక్రపాణి |
| ఆయది | + | టంకృతి | = | ఆయది టంకృతి |
| అది | + | తథ్యము | = | అది తథ్యము |
| ఇది | + | పథ్యము | = | ఇది పథ్యము |

15. ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గ స డ ద వ లగు.

| | | | | |
|---|---|---|---|---|
| కూర | + | కాయ | = | కూరగాయలు |
| కాలు | + | చేయి | = | కాలుసేతులు |
| టక్కు | + | టెక్కు | = | టక్కుడెక్కులు |
| తల్లి | + | తండ్రి | = | తల్లిదండ్రులు |
| ఊరు | + | పల్లె | = | ఊరువల్లెలు |

16. ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళము లగు.

| | | | | |
|---|---|---|---|---|
| పూచెను | + | కలువలు | = | పూచెను గలువలు |
| తోఁచెను | + | చుక్కలు | = | తోఁచెను జుక్కలు |
| చేసెను | + | టక్కులు | = | చేసెను డక్కులు |
| నెగడెను | + | తమములు | = | నెగడెను దమములు |
| మొగిడెను | + | పద్మము | = | మొగిడెను బద్మము |

17. ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాష నగు.

సంశ్లేషం బనఁగా మీఁదిహల్లుతోఁ గూడికొనుట.

పూచెను గలువలు = { పూచెం గలువలు / పూచెఁ గలువలు / పూచె న్గలువలు }

తోఁచెను జుక్కలు = { తోఁచెం జుక్కలు / తోఁచెఁ జుక్కలు / తోఁచె న్జుక్కలు }

చేసెను డక్కులు = { చేసెం డక్కులు / చేసెఁ డక్కులు / చేసె న్డక్కులు }

నెగడెను దమములు = { నెగడెం దమములు / నెగడెఁ దమములు / నెగడె న్దమములు }

మొగిడెను బద్మము = { మొగిడెం బద్మము / మొగిడెఁ బద్మము / మొగిడె న్బద్మము }

పక్షంబున స్వత్వం బగు. స్వత్వం బనఁగా ద్రుతంబునకుఁ బ్రకృతిభావము.

18. ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు లోపసంశ్లేషంబులు విభాష నగు.

వచ్చెను + గోవులు = వచ్చె గోవులు / వచ్చె న్గోవులు / వచ్చెను గోవులు

మెఱసెను + ఖడ్గము = మెఱసె ఖడ్గము / మెఱసె న్ఖడ్గము / మెఱసెను ఖడ్గము

19. వర్గయుక్పరుషములు పరము లగునపు డొకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానంబడియెడిని.

వచ్చెను + ధాత్రీపతి = వచ్చెం ధాత్రీపతి
పాడెను + గంధర్వుఁడు = పాడెం గంధర్వుఁడు
కన్ + దోయి = కందోయి

20. అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగా నగు.

వాఁడు వచ్చెన్ - వాఁడు వచ్చె - వాఁడు వచ్చెను.
ఈ లోపంబు పద్యాంతములయందు గణానుసారంబుగ వ్యవస్థితం బయి యుండు. గుర్వవసాయి యగు పద్యంబుతుదను స్వాత్వంబు లేదు.

ఉ॥ అతిశయముగ బుద్ధిమంతుఁ డగు బుధసేవన్.

21. కొన్ని యెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడి యెడిని.

అదియునున్నాక - దివంబునుం బోలె.

22. అఁట యిఁక చుఁడు శబ్దంబులం దప్ప నుడి తొలి హ్రస్వంబుమీఁద ఖండబిందువును ద్రుతంబునకు లోపం బును లేవు.

ముంగొంగు - క్రొంబసిఁడి - కన్దోయి.

23. తాను నేను పదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు.

| | | | | |
|---|---|---|---|---|
| తాను | + | చదివె | = | తాఁ జదివె<br>తాను జదివె |
| తాను | + | వినె | = | తా వినె<br>తాను వినె |

దీర్ఘంబు మీఁదిది గాన దీనికి నెఱసున్న లేదు.

24. సమాసంబునందు ద్రుతంబునకు లోపం బగు.

ఎల్లయర్థములు - ఎల్లకలుషములు. సర్వపర్యాయకం బయిన యెల్లశబ్దంబు ద్రుతాంతం బయిన యవ్యయంబు. దీని కసమాసంబున విశేష్యంబునకు ముందుఁ బ్రయోగంబు లేదు.

25. సమాసంబుల నుదంతంబు లగు స్త్రీ సమంబులకుం బుంపులకుం బరుషసరళములు పరము లగునపుడు నుగాగమ మగు.

ఇచటం బరుషంబులు పరంబు లగునపుడు ద్రుతంబునకు బిందుసంశ్లేషంబులచే మూఁడు రూపంబులు. సరళంబులు పరంబు లగునపుడు లోపసంశ్లేష పూర్ణబిందువులచేత మూఁడు రూపములు. విధానసామర్థ్యమువలన దీనికి లోపము లేదు. వక్ష్యమాణవిధిచే స్వత్వము లేదు.

చిగురు + కయిదువు = { చిగురుం గయిదువు / చిగురుఁ గయిదువు / చిగురు న్గయిదువు }

తళుకు + గజ్జెలు = { తళుకు గజ్జెలు / తళుకున్గజ్జెలు / తళుకుంగజ్జెలు }

సింగపు + కోదమ = { సింగపుంగోదమ / సింగపుఁగోదమ / సింగపున్గోదమ }

ఉన్నతంపు + గొడుగు = { ఉన్నతంపు గొడుగు / ఉన్నతంపున్గొడుగు / ఉన్నతంపుంగొడుగు }

నలుఁగడాదుల నీ యాగమంబు లేదండ్రు. ఈ యాగమం బాకానొకచోట స్థిరంబు పరం బగుచోఁ గానంబడియెడి. గఱువుపున్మరువు.

26. సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబు లేదు.

27. తలఁబ్రాలు మొదలగు సమాసంబుల ద్రుతమునకు లోపము లేదు.

తలఁబ్రాలు - ఒడిఁబ్రాలు - సేసఁబ్రాలు - ఊరఁబంది- ఊరఁబిచ్చుక - తోడఁబుట్టువు - తోఁబుట్టువు - ఒల్లఁబాటు - ఒడఁబాటు - ఇత్యాదులు.

✓ 28. కర్మధారయంబులం దుత్తున కచ్చు పరం బగునపుడు టు గాగమం బగు.

| | | | | |
|---|---|---|---|---|
| కఱకు | + | అమ్ము | = | కఱకుటమ్ము |
| నిగ్గు | + | అద్దము | = | నిగ్గుటద్దము |
| సరసపు | + | అలుక | = | సరసపుటలుక |

. 29. కర్మధారయంబునందుఁ బేర్వాదిశబ్దముల కచ్చు పరం బగునపుడు టు గాగమంబు విభాష నగు.

పేరు + ఉరము = { పేరుటురము / పేరురము }

చిగురు + ఆకు = { చిగురుటాకు / చిగురాకు }

పొదరు + ఇల్లు = { పొదరుటిల్లు / పొదరిల్లు }

30. పేదాదిశబ్దంబుల కాలుశబ్దము పరం బగునపుడు కర్మధారయంబునందు రు గాగమం బగు.

పేద + ఆలు = పేదరాలు

బీద + ఆలు = బీదరాలు

పేద - బీద - ముద్ద - బాలెంత - కొమ - జవ - అయిదువ - మనుమ - గొడ్డు - ఇట్టివి పేదాదులు. ఇందు జవ్వని శబ్దంబునకు జవాదేశం బని యెఱుంగునది. "ఏకాంతము నందు నున్న జవరాండ్ర" నని ప్రయోగము.

31. కర్మధారయంబునం దత్సమంబుల కాలుశబ్దము పరం బగునపు డత్వంబున కుత్వంబును రు గాగమంబు నగు.

ధీర + ఆలు = ధీరురాలు

గుణవంత + ఆలు = గుణవంతురాలు

ఇచట వృత్తియం దాలుశబ్దము స్త్రీమాత్రపరము.

32. కర్మధారయంబులందు ము వర్ణకంబునకుం బుంపు లగు.

సరసము + మాట = { సరసపుమాట / సరసంపుమాట }

విరసము + వచనము = { విరసపువచనము / విరసంపువచనము }

33. ఉదంత మగు తద్ధర్మార్థవిశేషణమున కచ్చు పర మగునపుడు ను గాగమం బగు.

చేయు + అతఁడు = చేయునతఁడు

చేసెడు + అతఁడు = చేసెడునతఁడు

34. షష్ఠీసమాసమునం దుకార ఋకారముల కచ్చు పర మగునపుడు ను గాగమం బగు.

విధాతృ (యొక్క) + ఆనతి = విధాతృనానతి

రాజు (యొక్క) + ఆజ్ఞ = రాజునాజ్ఞ

35. ఉదంతస్త్రీసమంబులకును, ఋంపులకు నదంత గుణవాచకంబులకును దనంబు పరం బగునపుడు ను గాగమం బగు.

సొగసు + తనము = { సొగసుందనము / సొగసుఁదనము / సొగసున్దనము }

సరసపు + తనము = { సరసపుఁదనము / సరసపుందనము / సరసపున్దనము }

తెల్ల + తనము = { తెల్లఁదనము / తెల్లందనము / తెల్లన్దనము }

36. సమాసంబునఁ బ్రాతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు.

ప్రాఁత + ఇల్లు = { ప్రాయిల్లు / ప్రాఁతయిల్లు }

లేఁత + దూడ = { లేదూడ / లేఁతదూడ }

పూవు + రెమ్మ = { పూరెమ్మ / పూవురెమ్మ }

37. లుప్తశేషంబునకుం బరుషములు పరము లగు నపుడు ను గాగమం బగు.

| | | | | |
|---|---|---|---|---|
| ప్రాఁత | + | కెంపు | = | ప్రాఁగెంపు |
| లేఁత | + | కొమ్మ | = | లేఁగొమ్మ |
| పూవు | + | తోఁట | = | పూఁదోఁట |
| మీఁదు | + | కడ | = | మీఁగడ |
| కెంపు | + | తామర | = | కెందామర |
| చెన్ను | + | తోవ | = | చెందోవ |

చెన్ను శబ్దము వృత్తిని శోణార్థకంబు ; బహుళగ్రహణముచే మీఁదు ప్రభృతులందు నిట లోపంబు నిత్యంబు; వ్యవస్థిత విభాషచే నీ ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు.

38. క్రొత్త శబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్ని యెడల ను గాగమంబునుం గొన్ని యెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు

| | | | | |
|---|---|---|---|---|
| క్రొత్త | + | చాయ | = | క్రొంజాయ |
| క్రొత్త | + | చెమట | = | క్రొంజెమట |
| క్రొత్త | + | పసిఁడి | = | క్రొంబసిఁడి |
| క్రొత్త | + | కారు | = | క్రొక్కారు |
| క్రొత్త | + | తావి | = | క్రొత్తావి |

పరుషేతరంబులు పరంబు లగునపుడు ను గాగమప్రాప్తి లేమింజేసి వానికి ద్విత్వం బగు.

| | | | | |
|---|---|---|---|---|
| క్రొత్త | + | గండి | = | క్రొగ్గండి |
| క్రొత్త | + | నన | = | క్రొన్నన |
| క్రొత్త | + | మావి | = | క్రొమ్మావి |

కెంధూళి కెంజడ లని ప్రయోగంబులు కానంబడియెడి. బహుళగ్రహణముచేతఁ గ్రొత్తకుండ లిత్యాదుల లోపంబు లేదు; క్రీఁగడుపు – క్రీఁగాలు – క్రీఁదొడ – ఇత్యాదులం గ్రింది శబ్దమునకు లుప్తశేషంబునకు దీర్ఘంబు బహుళగ్రహణము చేత నని యెఱుంగునది.

39. అన్యంబులకుసహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి.

ఒకానొకశబ్దంబున కొకానొకశబ్దము పరం బగునపుడు తొంటియట్లు లోపనుగాగమంబులును గొండొకశబ్దమున కొకానొకశబ్దము పరం బగునపుడు లోపద్విత్వంబులును బ్రయోగంబు నందుఁ జూపట్టెడు నని తాత్పర్యము.

| | | | | |
|---|---|---|---|---|
| పది | + | తొమ్మిది | = | పందొమ్మిది |
| తొమ్మిది | + | పది | = | తొంబది |
| వంక | + | చెఱఁగు | = | వంజెఱఁగు |
| సగము | + | కోరు | = | సంగోరు |
| నిండు | + | వెఱ | = | నివ్వెఱ |
| నిండు | + | వెఱఁగు | = | నివ్వెఱఁగు |
| నెఱ | + | తఱి | = | నెత్తఱి |
| నెఱ | + | నడుము | = | నెన్నడుము |
| నెఱ | + | మది | = | నెమ్మది |
| నెఱ | + | వడి | = | నెవ్వడి |

ఇత్యాదులు ప్రయోగంబువలనం దెలియునది.

40. ఆమ్రేడితంబు పరం బగునపుడు కడాదులఁ దొలి యచ్చుమీఁది వర్ణంబులకెల్ల నదంతం బగు ద్విరుక్తటకారంబగు.

ఈ సూత్రంబునకు భృశార్థంబునందు ద్విరుక్తంబు విషయం బని యెఱుంగునది.

| | | | | |
|---|---|---|---|---|
| కడ | + | కడ | = | కట్టకడ |
| ఎదురు | + | ఎదురు | = | ఎట్టఎదురు |

కడ - ఎదురు - కొన - చివర - తుద - తెన్ను - తెరువు - నడుము - పగలు - పిడుగు - బయలు - మొదలు ఇత్యాదులు కడాదులు.

✓41. ఆమ్రేడితంబు పరం బగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు.

| | | | | |
|---|---|---|---|---|
| అప్పటికిన్ | + | అప్పటికిన్ | = | అప్పటప్పటికిన్ / అప్పటికప్పటికిన్ |
| అక్కడన్ | + | అక్కడన్ | = | అక్కడక్కడన్ / అక్కడనక్కడన్ |
| ఇంటన్ | + | ఇంటన్ | = | ఇంటింటన్ / ఇంటనింటన్ |
| ఊరన్ | + | ఊరన్ | = | ఊరూరన్ / ఊరనూరన్ |

ఇంచుక నాఁడిత్యాదులందు బహుళగ్రహణముచేత నంతిమాక్షరలోపంబు నగు.

| | | | | |
|---|---|---|---|---|
| ఇంచుక | + | ఇంచుక | = | ఇంచించుక / ఇంచుకించుక |
| నాఁడు | + | నాఁడు | = | నానాఁడు / నాఁడునాఁడు |

42. అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు.

అందదుకు - ఇట్టిందకులు - ఇల్లిగ్గులు - చెల్ల చెదరు- చెల్లాచెదరు - తుత్తుమురు - తుత్తునియలు - మిఱుమిట్లు- ఇత్యాదు లెఱుంగునది.

43. చేత, తోడ, వలన ల కిత్వంబు సమాసంబులం దగు.

నీచేతన్ + ప్రోపు = నీచేతి ప్రోపు
నాతోడన్ + చెలిమి = నాతోడి చెలిమి
నీ వలనన్ + భయము = నీ వలని భయము

44. అంద్వాదుల కలిగాగమంబు సమాసంబులం దగు.

నాయందున్ + కరుణ = నాయందలి కరుణ
ఇందున్ + జనులు = ఇందలి జనులు
ఎందున్ + వారు = ఎందలివారు

ఎందు శబ్దమున కలిగాగమము కొందఱు లేదంద్రు.

45. అది యవి శబ్దంబుల యత్తునకు వ్యృత్తిని లోపంబు బహుళంబుగ నగు.

నా + అది = { నాది / నాయది }

నా + అవి = { నావి / నాయవి }

ఉదంతము లగు తద్ధర్మవిశేషణంబులకు మీఁద లోపంబు లేదనియు, నిదంతంబు లగు తద్ధర్మవిశేషణంబులకుమీఁద నిత్యంబనియు బహుళగ్రహణముచే నెఱుంగునది.

వచ్చునది - తచ్చునవి ; వచ్చెడిది - వచ్చెడివి

✓46. పడ్వాదులు పరంబు లగునపుడు మువర్ణకంబునకు లోపపూర్ణబిందువులు విభాషనగు.

భయము + పడె = { భయపడె / భయంపడె / భయముపడె }

సూత్రము + పట్టె { సూత్రపట్టె / సూత్రంపట్టె / సూత్రముపట్టె }

ఈ కార్యము కర్తృవాచి మువర్ణకమునకుఁ గలుగదు. గజము పడియె - అశ్వము పడియె.

47. మధ్యమపురుష మువర్ణకంబునకు హలవసానంబులు పరంబు లగునపుడు లోపము విభాష నగు

చూడుము + నన్ను = { చూడు నన్ను / చూడుము నన్ను }

ఇటు + చూడుము = { ఇటు చూడు / ఇటు చూడుము }

చూడు మనియె-విను మనియె. ఇచ్చట నచ్చు పరం బయినది. కాఁబట్టి లోపము లేదు.

48. వ్యతిరేక మధ్యమ మువర్ణకంబున కెల్లయెడల లోపంబు విభాష నగు.

నమ్మకుము + ఇట = { నమ్మకిట / నమ్మకు మిట

49. ఆమ్రేడితంబు పరం బగునపుడు మధ్యమ ముదుజ్జులకు లోపంబు విభాషనగు.

ఉండుము + ఉండుము = { ఉండుండుము / ఉండుముండుము

కొట్టుఁడు + కొట్టుఁడు = { కొట్టుకొట్టుఁడు / కొట్టుఁడుకొట్టుఁడు

50. విసర్గంబున కనుకరణంబున లోపం బగు.

వర్ధతాం శ్రీః + అనియె = వర్ధతాం శ్రీ యనియె.

51. అనుకృతిని నమశ్శబ్దము తుదియత్తున కోత్వము విభాష నగు.

తుభ్యం నమః + అనె = { తుభ్యం నమో యనె / తుభ్యం నమ యనె

ఈ కార్యము లాఁతిచోసహితము గనంబడియెడి.

ఉ॥ గతానుగతికో లోకో యటంచున్.

52. అనుకరణంబునం దుదిహల్లునకు ద్విర్వచనం బగు.

కింతత్ + అనియె = కింతత్తనియె

కస్త్వమ్ + అనియె = కస్త్వమ్మనియె

53. అనుకరణంబునం దహమాదుల మకారంబునకు ద్విరుక్తి విభాష నగు.

దాసోహమ్ + అనె = { దాసోహమ్మనె / దాసోహమనె }

తత్కర్తవ్యమ్ + అనె = { తత్కర్తవ్యమ్మనె / తత్కర్తవ్యమనె }

54. ఉదంతనామంబున కనుకరణంబునందు వు గాగమం బగు.

ఇయంధేను + అనె = ఇయంధేనువనె.

అనుకృతిని నిడుదకుం గుఱుచ యగు నని యొకండు పలికె నది నిరాకరంబు. ఉ॥ దుర్బలస్య బలం రాజా యన వినవే.

55. వాక్యావసానంబున సంధి లేమి దోషంబు గా దని యార్యు లండ్రు.

సత్యము సర్వశ్రేయము. అది లేనిచో సర్వధర్మములు వ్యర్థములు. ఇట్లు సంధివిరహంబు కావ్యంబులం బాదాంతమంద చూపట్టెడు.

# ప్రవేశిక

"మునుమదుపజ్ఞం బగుచుం
దనరిన వ్యాకృతిని సూత్రతతి యొకకొంతం
దెనిఁగించి యిది ఘటించితి
ననయము బాలావబోధ మగుభంగిఁ దగన్.

తెనుఁగునకు శబ్దలక్షణ
మనయం బరయంగ వేడ్క నందినవారల్
తనరఁగ నీ వ్యాకరణం
బున మూలం బయినకృతిని బోలఁ గనఁ దగున్."

శ్రీ పరవస్తు చిన్నయసూరి ఆంధ్రభాషకు ప్రామాణికస్వరూపమును నిరూపించు ఉద్దేశముతో సంస్కృతమున నొక వ్యాకరణమును రచించెను. కాని బాలురకును, కేవలము తెనుగు చదువుకొనువారికి నర్థము కావలయు నను అభిప్రాయముతో అందలి కొన్ని సూత్రములను తెనుగుచేసి బాలవ్యాకరణ మను పేర క్రీ. శ. 1858 లో ముద్రింపించెను. శ్రీ చిన్నయసూరి పైని చెప్పిన మాటలనుబట్టి బాలవ్యాకరణము సమగ్రము కాదని తేలుచున్నది. తెనుగున శబ్దలక్షణమును సమగ్రముగా తెలిసికోదలచినవారు సంస్కృతమూలకృతినే చూచుట యవసరము.

# గ్రంథనామము

బాలవ్యాకరణ మనగనే చిన్నతరగతుల విద్యార్థుల కొరకని కొందరు భ్రాంతి పడుచుందురు. ఇక్కడ బాల శబ్దము నకు "అప్రౌఢుడు" అని అర్థముకాదు. ఈ యర్థమునే భావించి శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులు తాను వ్రాసిన "త్రిలింగ లక్షణ శేషము"నకు "ప్రౌఢవ్యాకరణము" అని పేరు పెట్టెను. కాని నిజమునకు ప్రౌఢవ్యాకరణముకంటె బాలవ్యాకరణమే ప్రౌఢతరమైనది. "గ్రహణధారణపటుర్బాలః" అనుటచే విష యమును గ్రహించి ధారణ చేయగల సామర్థ్యము గలవాడు బాలు డని అర్థమగుచున్నది. విశేషముగా శబ్దవ్యుత్పత్తిని గలుగజేయునది వ్యాకరణము. కావున బాలవ్యాకరణము గ్రహణధారణపటువులైన బాలురకు విశేషముగా శబ్దవ్యుత్పత్తిని గలుగజేయున దగుచున్నది.

# సంజ్ఞాపరిచ్ఛేదము

ఈ వ్యాకరణమునందు పది విభాగములుగలవు. ఒక్కొక్క విభాగమునకు "పరిచ్ఛేదము" అని పేరు. మొదటిది సంజ్ఞా పరిచ్ఛేదము. సంజ్ఞ యనగా 'పేరు' అని యర్థము. బాలవ్యాక రణమునందు వచ్చు పేళ్ళను తెలియజేయునది సంజ్ఞాపరిచ్ఛే దము. ఇది దాని యర్థము. కాని సంజ్ఞాపరిచ్ఛేదమందు సంజ్ఞలను చెప్పుటయే కాక సూరి యితరవిషయములనుకూడ చెప్పెను.

సంజ్ఞాపరిచ్ఛేదమందలి మొదటి నాలుగు సూత్రములును సంజ్ఞలను తెల్పునవి కావు. అట్లే పదునాలుగవసూత్రమునుండి పదునేడవసూత్రమువరకు, ఇరువదవ సూత్రమును సంజ్ఞలను దెల్పవు. పోనీ! సంజ్ఞలన్నియు ఈ పరిచ్ఛేదమందే కలవేమో యనుకొంద మన్నను అది నిజముకాదు. సంధిపరిచ్ఛేదము మొదటిలోనే సంధి యను సంజ్ఞయు దానికి వివరణమును కలవు. అట్లే అవసరమునుబట్టి వేర్వేరు సంజ్ఞలు ఉపయోగింప బడినవి. కాబట్టి సంజ్ఞాపరిచ్ఛేదము వ్యాకరణప్రవేశమునకు ముందుగా అవసరమయిన విషయములను మాత్రమే తెల్పు చున్నదనుట సమంజసము.

## వర్ణసమామ్నాయము (1–4)

భాష వాక్యములవలన ఏర్పడును. వాక్యములు శబ్ద ములవలన, శబ్దములు వర్ణములవలన ఏర్పడును. అందువలన అక్షరములను ముందుగా చెప్పుచున్నాడు. తెనుగునకు సంస్కృత ప్రాకృతభాషలతో గరిష్ఠ సంబంధము కలదు. కావున వానిలోని యక్షరములను తెలిసికొనుట ఆవశ్యకము. సంస్కృతమునందు ఏబది యక్షరములు గలవు.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ
ఏ ఐ ఓ ఔ అం అః
క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ
ట ఠ డ ఢ ణ త థ ద ధ న
ప ఫ బ భ మ య ర ల వ శ ష స హ ళ.

వీనియందు "అ" మొదలు "అః" వరకుగల పదునారు అక్షరములను 'అచ్చులు' అందురు. 'క' మొదలు 'ళ' వరకుగల ముప్పదినాలు గక్షరములను "హల్లులు" అందురు. "అజ్ఝల్విభాగ మీలాగుననే మీఁద నెఱుంగునది." అని చిన్నయసూరి దీని నొక సంకేతముగా మాత్రమే చెప్పాచున్నాడు. కావున "అచ్చులు, హల్లులు" నియమితమైన పేళ్లు కావని స్పష్టమగుచున్నది. అచ్చులను స్వరము లని ప్రాణము లని కూడ వాడుదురు. హల్లులను వ్యంజనము లని ప్రాణు లని వాడుదురు. అచ్చులు హల్లులు అనునవి ప్రత్యాహారములు. మహేశ్వరసూత్రములు పదునాలుగు.

1. అ ఇ ఉ ణ్ 2. ఋ ౡ క్ 3. ఏ ఓ ఙ్ 5. ఐ ఔ చ్ మొదటివర్ణమగు అకారమును ఇద్వర్ణమగు 'చ్' ను జోడింపగా 'అచ్' ఏరడ్పినది.

5. హ య వ ర ట్ 6. ల ణ్ 7. ఞ మ ఙ ణ న మ్
8. ఝ భ ఞ్ 9. ఘ ఢ ధ ష్ 10. జ బ గ డ ద శ్
11. ఖ ఫ ఛ ఠ థ చ ట త వ్ 12. క ప య్
13. శ ష స ర్ 14. హ ల్

5వ సూత్రమందలి మొదటివర్ణమగు 'హ' ను చివరి ఇత్సంజ్ఞయగు 'ల్'తో జోడింపగా 'హల్' అయినది. ప్రతి సూత్రమునకు చివరనున్న హల్లక్షరములు ఇత్సంజ్ఞలు. ఏ యక్షరమునకు ఏ ఇత్సంజ్ఞను జోడింతురో ఆ యక్షరమునకు

ఆసంజ్ఞకుమధ్య గలవర్ణములకు అది సంజ్ఞయగును. ప్రాకృతము నందు నలువది యక్షరములు గలవు—

అ ఆ ఇ ఈ ఉ ఊ ఏ ఓ అం అః॥

క ఖ గ ఘ చ ఛ జ ఝ ట ఠ డ ఢ ణ

త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ స హ ళ॥

కొందరు వ్రక్రములైన 'ఎ ఒ' లును మరికొందరు వక్రతమము లైన 'ఐ ఔ' లును కూడ ప్రాకృతమునందు గల వని అందురు. అట్లైనచో మొత్తము నలువదినాలుగు అక్షరము లగును.

తెలుగునందు ముప్పదియాఱక్షరములు గలవు—

అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అః॥

క గ చ చ̄ జ జ̄ ట డ ణ త ద న ప బ మ

య ర ల వ స హ ళ॥

ప్రాకృతసమము, తద్భవము, దేశ్యము అయిన తెనుగుభాష యందు పై ముప్పదియాఱు వర్ణములు మాత్రమే యుండును. సంస్కృతసమ మయిన తెనుగుభాషయందు పందొమ్మిదక్షర ములు అదనముగా చేరును. అవి యివి—

ఋ ౠ ఌ ౡ విసర్గ ఖ ఛ ఠ థ ఫ

ఘ ఝ ఢ ధ భ జ ఞ శ ష॥

వీనితో కలిసి ప్రచలితమగు ఆంధ్రభాషయందు ఏబదియై దక్షరము లగును.

## పరుష సరళ స్థిరములు (5-6)

హల్లులు పరుషములని, సరళములని, స్థిరములని మూడు విధములు. పరుషముగా ఉచ్చరింపబడునవి పరుషములు— క చ ట త ప॥ పరుషములకంటె సరళముగా ఉచ్చరింప బడునవి సరళములు – గ జ డ ద బ॥ ఇవి కాక మిగిలియున్న హల్లు లన్నియు స్థిరములు – ఖ ఘ ఙ ఛ ఝ ఞ ఠ ఢ ణ థ ధ న ఫ భ మ య ర ల వ శ ష స హ ళ.

## దంత్య తాలవ్య చ జ లు (7-10)

చ జ లు రెండు రకములు. 1. దంత్యములు, 2. తాలవ్యములు. జిహ్వాగ్రము దంతములను స్పృశించుటవలన ఉచ్చరింపబడునవి దంత్యములు. నాలుక తాలువును స్పృశించుట వలన ఉచ్చరింపబడునవి తాలవ్యములు. తాలువు అనగా "దవడ" అని కొందరు భ్రమపడిరి. కాని అది సరికాదు. తాలువు అనగా "అంగిలి" అని అర్థము. మూర్థమునకును దంతమూలము నకును మధ్యప్రదేశము తాలువు.

ఇ ఈ ఎ ఏలం గూడిన చ జ లు తాలవ్యములు.

చిలుక – చీమ – చెలి – చేమ – జిల – జీడి – జెట్టి – జేజె.

అ ఆ ఉ ఊ ఒ ఓ ఔలం గూడిన చ జ లు దంత్యములు.

చలి - చాప - చుక్క - చూపు - చొక్క - చోటు - చౌక
జముడు - జాతర - జున్ను - జూలు - జొన్న - జోలి - జౌక.

పై విభాగమున సంవృతాచ్చులతో కలిసిన చ జ లు తాలవ్యములుగా, వివృతాచ్చులతో కలిసిన చ జ లు దంత్యములుగా తేలినవి. ఐకారము సైతము వివృతాచ్చు. దానిని గూడిన చ జ లు కూడ దంత్యములు కానగును. కాని సమేతరశబ్దములందు ఐత్వముతో కూడిన చ జ లు లేవు. కావున దానిని సూత్రమునందు చెప్పవలసిన ఆవశ్యకము లేకపోయినది. చైత్రము, జైత్రుడు మొదలయిన శబ్దములు తత్సమములు. వానియందు ఐదంతములైన చ జ లు గలవు. అన్యత్ర ఇవి లేవు. ఆంధ్రనామసంగ్రహమందు "చైవుల సాకిరిచాయ మగడు" అని ఒక ప్రయోగము కలదు. "చైవులు" అనుటకు సాధురూపము "చెయువులు" అనికాని "చెయ్వులు" అనికాని యుండవలయును. ఈనాడు "జై" అను నినాదములందు ఐదంతమైన జకారము కాక "జయ" యని యుండుట తగును.

సంస్కృతసమములందు చ జ లు అన్నియు తాలవ్యములే.

చంద్రుఁడు - చామరము - చుక్రిక - చూర్ణము - చోరుఁడు - చౌర్యము - జయము - జాతి - జుగుప్స - జూటము.

కాని అర్చి, రోచి, వీచి, మున్నగు శబ్దములందువలె ఉపధా చ జ లు బహువచనము పర మగునపుడు దంత్యము లగును. ఉపధ అనగా తుదివర్ణమునకు ముందువర్ణము. అర్చి-తుదివర్ణము "ఇ". దానికి ముందువర్ణము "చ్". తత్సమపరిచ్ఛేదమునందలి "ఇత్తునకు బహువచనము పరం బగునపు డుత్వం బగు" అను సూత్రముచేత అర్చి-అర్చులు అగును. తాలవ్యచకారము ఉత్వమునొంది దంత్య మైనది.

ఇట్లు బహుత్వమున వచ్చిన ఉత్వముచేత దంత్యము లైన చ జ లు మాత్రము గలవు. సంస్కృతమున గల "రాజా" అను శబ్దము తత్సమరూపముగా "రాజు" ఐనది. ఇదియును, ఉచ్చారణమునుబట్టి దంత్యముగా వినబడుచున్నది.

ఇంత వివేచన చేసితిమి. దీనికి గల ప్రయోజన మేమి? అని ఆలోచించుట యవసరము. పరుష మయిన 'చ'ను గురించి సరళమయిన "జ" ను గురించి దంత్యతాలవ్యము లయిన చ జ లను గురించి తెలిసికొంటిమి. పరుషములయందు ఐ దక్షరములు; సరళములయందు ఐ దక్షరములు మాత్రమే గుర్తించితిమి. ఇంతవరకు సంస్కృతసమభాషకు సరిపోవును. కాని తెనుగున చ̄ జ̄ లు గూడ గలవు. వీని నెట్లు వర్గీకరింపవలయునన్న "చ జ" ల వలెనే యని సమాధానముగా దంత్యతాలవ్యము లయిన చ జలు సవర్ణము లని సూత్రీకరించెను. దీనివలన చ̄వర్ణము చ వర్ణమువంటి దని, జ̄ వర్ణము

జ వర్ణమువంటి దని తెలియుచున్నది. అనగా తాలవ్యము లగు చ జ లకు ప్రవృత్తియున్న అన్నిస్థలము లందును దంత్యములగు చ జ లకు గూడ ప్రవృత్తి కల దని నిర్ణయము. ద్రుత కార్యవిషయమున, గ స డ ద వాదేశవిషయమున ఈ వివేచనకు ప్రయోజనము కలదు.

కొందరు దీనిని గుర్తింపక "యతిప్రాసాదికార్యము లందు దంత్యము తాలవ్యము ఒకదానికొకటి ప్రతినిధిగా నుండ దగు"నని యర్థము చెప్పిరి. ఇది అసంగతము; ప్రకరణోచితము కాదు. చిన్నయసూరి ప్రకీర్ణకపరిచ్ఛేదము చిట్టచివరమాత్రమే ఛందస్సును గూర్చి రెండు సూత్రములు వ్రాసెను. అవియు సాధురేఫ శకటరేఫముల భిన్నత్వమును నిర్ధారించుటయే కాని ఛందఃప్రయోజనము కలవి కావు. తాను వ్రాయునది వ్యాకరణమైనప్పుడు ఛందస్సునుగూర్చి చెప్పవలసిన యవసర మేలేదు. అట్టియెడ చెప్పె ననుకొనుట వట్టిభ్రాంతి.

### కళా ద్రుతప్రకృతికములు [11-13]

ద్రుత మనగా ద్రవించునది అని యర్థము. అనగా అక్కరలేనపుడు తొలగిపోవునది. నకారము ద్రుతము. నకార మనగా పొల్లు న కారమును మాత్రమే కాక ఉత్వ విశిష్టమయిన న కారమునుకూడ గ్రహించుట సూరికి సమ్మతము. అందువలననే నేను - తాను పదంబుల కడపటి వర్ణములను ద్రుతములుగా పంద్రెండవసూత్రమున ఉదాహరించెను.

ద్రుతమును అంతమందు కలిగిన పదములు ద్రుతప్రకృతికములు.

ప్రథమా, కయి, పట్టి, యొక్క - అనునవి కాక మిగిలిన విభక్తు లన్నియు ద్రుతప్రకృతికములు. నన్నున్, నాచేతన్, నాతోడన్, నాకొఱకున్, నావలనన్, నాకంటెన్, నాకున్, మాలోపలన్, మాయందున్.

ఉత్తమపురుషైకవచనములు అనగా నేను అను సర్వనామముతో అన్వయించు క్రియారూపములు-వత్తున్, వచ్చెదన్.

భూత ప్రథమ పురుషైకవచనములు-వాడు, అతడు వంటి సర్వనామముతో అన్వయించు భూతకాలిక క్రియలు-వచ్చెన్.

తద్ధర్మార్థక ప్రథమ పురుషైకవచనములు-వచ్చున్, వచ్చెడున్.

ఆశీస్సు, శాపము మున్నగువానియందగు "ఎడు, త" అను ప్రత్యయములు-ప్రసన్ను లయ్యెడున్, కావుతన్.

శత్రర్థకములు-వర్తమానక్రియను బోధించునవి-కొట్టుచున్.

తుమర్థకములు-కొఱకు అను అర్థమును బోధించునవి— కొట్టన్, కొట్టగన్.

ఆనంతర్యార్థకములు-తరువాత జరిగిన పనిని బోధించునవి-కొట్టుడున్.

చేదర్థకములు-అయినచో అను అర్థమును బోధించునవి-కొట్టినన్.

ఇవి కాక నేను, తాను అను పదములు-వలెన్, పోలెన్ అను అవ్యయములు-ఎంతయున్, అయ్యున్ అను సముచ్చయార్థకములు మున్నగునవి ద్రుతప్రకృతికములు.

పైని చెప్పినవి కాక మిగిలిన శబ్దములు కళలు. వీనికి చివర ద్రుతము ఉండదు.

ప్రథమావిభక్తిప్రత్యయములు- రాముఁడు, రాములు, హాయము, విష్ణువు- అచ్చతెనుగుశబ్దము లయిన గోడ, మేడ, అయ్య, అమ్మ మున్నగునవికూడ కళలే. వీనికి చివర ప్రథమా విభక్తిప్రత్యయము లేకపోయినను ఉన్నట్లుగా గణించుట శాస్త్రసమ్మతము. శబ్దము ప్రకృతి ప్రత్యయముల కలయిక వలన ఏర్పడును. పైవి శబ్దములు. అందువలన ప్రకృతిపై ప్రత్యయమును విధించి, దానిని లోపింపజేసికొనవలయును. ఇది ప్రక్రియయందు సామ్యమును సాధించుటకై చేసికొను సౌకర్యము.

కయి ! అను చతుర్థీ విభక్తిప్రత్యయము, పట్టి అను పంచమీవిభక్తిప్రత్యయము, యొక్క అను షష్ఠీవిభక్తి ప్రత్యయమును గూడ కళలే-రామునికయి, జ్ఞానముఁబట్టి, నాయొక్క.

భూతకాల ప్రథమపురుష బహువచనము-వచ్చిరి.

భూతకాల మధ్యమపురుష-వచ్చితివి, వచ్చితిరి.

భూతకాలోత్తమపురుష బహువచనము-వచ్చితిమి.

వ్యతిరేకార్థకక్రియలు-రాఁడు, రారు, రాదు, రావు, రాము.

వ్యతిరేకక్త్వార్థకక్రియలు-కొట్టక, తిట్టక.
క్త్వార్థకక్రియలు- ఎత్తిలి, ఒత్తిలి.
తూష్ణీమర్థకములు- ఊరక, మిన్నక.
ప్రశంసార్థకము- బళి
సంతాపార్థకము- అక్కట.
ప్రశ్నార్థకము-ఏల.

ఇట్టివి కళలు. ఇత్యాదు లూహ్యాము లని యనుటవలన—
"అట్టులు, ఇట్టులు, ఎట్టులు" అను ప్రకారార్థకములును,
"మఱి, మిక్కిలి" మున్నగు అత్యంతార్థకములును,
"ఏ, ఆ" మున్నగు అవధారణార్థకములును గూడ
గ్రాహ్యాము లగుచున్నవి.

## బిందువివేకము (14-16)

హ్రస్వముమీఁది ఖండబిందువునకు పూర్ణబిందువు వైకల్పికముగ నగు నని చిన్నయసూరి చెప్పెను. ఈ సూత్రమునందు సూరి యుద్దేశించినది. స్థిరబిందువునే యనుట ఉదాహరణములనుబట్టి స్పష్టము.

అడఁకువ - అడంకువ; అరఁటి - అరంటి; ఎఱుఁగుట - ఎఱుంగుట; బలఁగము - బలంగము; మగఁటిమి - మగంటిమి

ఈ సూత్రము కొంతవరకు ఆశ్చర్యమును గలిగించున దనక తప్పదు. దీనివలన చిన్నయసూరి అర్ధబిందువుఁకు పూర్ణబిందువును వైకల్పికముగ విధించుచున్నట్లు కన్పించును. కాని

ఆయన అభిప్రాయ మది కాదు. భాషాసంప్రదాయమునుబట్టి పూర్ణబిందువులు ప్రాథమికములు. అవియే ఉచ్చారణమున మెల్ల మెల్లగా శ్లథము కాసాగినవి. వానిని వ్రాతలో మాత్రము నిల్పుకొనుచు వచ్చిరి. అయినను తిక్కననాటికే సబిందుక నిర్బిందుక శబ్దముల స్పష్టత సన్నగిల్లినది. అందువల్లనే ఆయన నన్నయ వాడని ఖండాఖండప్రాసము నంగీకరించి వాడెను. సూరి సబిందుకశబ్దములను గుర్తెఱుగుటకై యిట్లు సూత్రించెను. అడంకువ అనునది అడఁకువగా ఉచ్చరింపబడుచున్నను కకారమునకు పూర్వమందు బిందువున్నదను విషయమును గుర్తింపవలయు ననుటయే ఆయన ఉద్దేశము. కాని దీని నిట్లే వ్రాసిన పూర్ణబిందువుండియున్న శబ్దములకు ఖండబిందువు చెప్పినట్లయి ఒకచిక్కు గలుగును. నారింజ, చేమంతి మున్నగు శబ్దములు కూడ ఖండబిందువులను పొందవలసియుండును. దానిని తొలగించుకొనుటకు సూరి సూత్రమున నీ పద్ధతిని అవలంబించెను.

తరువాత దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు అని సూరి సూత్రించెను.

వాఁడు, వీఁడు, రాఁడు, లేఁడు, కాఁబోలు, కాఁబట్టి, గోఁగులు, రేఁగులు.

ఈ ఉదాహరణములలోని అర్ధానుస్వారము లన్నియు వ్యాకరణసాధ్యములు. దీర్ఘము పూర్వమం దుండుటచే వీనికి పూర్ణము లేదు అని చిన్నయసూరి నిషేధము. దీనినిబట్టి

"తీంట్ర" మున్నగుచోట్లనున్న సిద్ధపూర్ణబిందువు సూరికి అస మ్మతము కాదు. తేఁటి – తేంట్లు ; ఱేఁడు – ఱేండ్లు మున్నగు వానియందలి దీర్ఘముమీఁద పూర్ణబిందువుకూడ చిన్నయ సూరికి సమ్మతమే.

ఆచ్ఛికపరచ్ఛేదము పదునైదవ సూత్రమున "సమాన పదంబునందు సంయోగంబు పరంబగునపు డెల్లచో ఖండబిందు వునకుం బూర్ణం బగు" అని నిత్యముగా విధించుటచేత వ్యాకరణ సాధ్యము లయిన ఇట్టిరూపములు కూడ ఆయన కిష్టమే.

పూంచు, కాంచు మున్నగు ప్రయోగములు భారత హరివంశములందు గలవు. ఈసూత్రమునుబట్టి సూరి కివి సమ్మ తములు కావనవలసివచ్చును. నన్నిచోడుడు మున్నగు కొందరు వాండు, వీండు అనుటకు చిన్నయసూరి గతి కల్పింపలేదు.

సంస్కృత సమేతరము లయిన తెలుగు శబ్దములందు ఖండబిందువు గాని, పూర్ణబిందువు గాని పరుష సరళములకు ముందుమాత్రమే యుండును. ప్రాకృతసమములు, సంస్కృత భవములు, ప్రాకృతభవములు, దేశ్యములు అయిన తెలుగు శబ్దములందు పరుష సరళము లయిన క చ చ ట త ప, గ జ జ డ ద బ లకు ముందుమాత్రమే బిందు వుండు నని యర్థము. స్థిరవర్ణములకు ముందు బిందు వుండదని స్పష్టము. స్థిరవర్ణములకు ముందు బిందు వున్నచో ఆ శబ్దము సంస్కృత సమమని నిష్కర్షగా చెప్పవచ్చును.

వంకర, కలఁకువ, మంచు, త్రాఁచు, దంట, దాఁటు, కొంత కోఁత మున్నగునవి ఉదాహరణములు.

పోఁడిమి, వేసఁగి మున్నగు శబ్దములు పోణిమి, వేసవి అని రూపాంతరము నొందినపుడు బిందువు లోపించు ననువిషయము నీ సూత్రము జ్ఞాపన చేయును. అట్లే ఏండ్లు, కాండ్లు మున్నగు స్థలములందు డాకు ళాదేశము కొందరు విధింపగా స్థిరవర్ణములముందు బిందువు లేకుండుటచే అది గ్రాహ్యము కాదని సూరి నిరాకరించెను.

ఈ సూత్రమునకు భిన్నముగా "కంసాలి" అను శబ్దము మాత్రము తెనుగున స్థానము గడించుకొన్నది. దీనినిగూర్చి సూరి ఏమియు తెలుపలేదు.

వచ్చెం ధాత్రీపతి మున్నగుచోట్ల స్థిరవర్ణమునకుముందు బిందువును సూరి సంధిపరిచ్ఛేదము పదునాఱవసూత్రమున అంగీకరించెను. ఇది విశేష విధి.

యవు వూ వొ వో (17)

తెలుగుమాటలకు మొదట య కారంబును వు వూ వొ వో లును లే వని సూరి తెల్పెను. బాలవ్యాకరణ గుప్తార్థ ప్రకాశికాకర్త ణ కార ళ కారములు ఆదియందు గల పదములు కూడ లేవని, వానిని సూరి చెప్పలేదని ఒక నెపము వేసెను. ఇది ఈ సూత్రప్రయోజనమును గమనింపకుండుట మాత్రమే. సూరి ఇంతకుపూర్వము చేసిన వివేచనము కాని,

ఇందలి ఆదిమవర్ణ వివేచనము కాని లేఖనమును సరిచేయుట కుద్దేశింపబడినది. ఉచ్చారణమున కొందరు తప్పులు చేయు చుందురు. దానికి అశ్రద్ధ కారణము; కొందరిపట్ల అజ్ఞానముకూడ కారణ మగును. తెలుగుభాష ఉచ్చారణానుసారమయిన లేఖనవిధానము కలది. ఆంగ్లభాష మున్నగువానియందు ఉచ్చారణకు భిన్నముగా లిపి యుండును. కాని తెలుగున అట్లుకాదు. అట్టియెడల ఉచ్చారణమందలి అశ్రద్ధకారణముగా, తదనుసారి యగు లేఖనమందును దోషము కలుగుటకు అవకాశము ఉన్నది. దానిని వారించుటయే ఈ సూత్రము ప్రయోజనము; అందువలననే ణ, ళ లు తెలుగు మాటలకు మొదట లేవని చెప్పలేదు. అవి యున్న వనుకొను పొరపాటున కవకాశ మున్న ప్పుడు కదా! లే వని చెప్పవలసిన యవసరము.

శిష్టుల వ్యవహారమందు సైతము "ఎవడు, ఎక్కడ" అనుటకు బదులుగా "యెవడు, యెక్కడ" అని నేడు విన్పించు చుండును. "ఊరు" అనుటకు బదులుగా "వూరు" వినిపించు చుండును. ఇట్లే నన్నయకాలమందు నుండి యుండవచ్చును. అందువలనే నన్నయ పదాది యకారము నంగీకరించి, దానికి అజ్వాత్కార్యమును విధించెను. అధర్వణుడు నట్లే చేసెను. ఇది కావ్యభాషకు సంబంధించినది.

చిన్నయసూరి "య"ను అంగీకరించి, తరువాత అజ్వాత్కార్యమును విధించికొనుటలోని క్లేశమును గమనించి సౌక

ర్యముకొరకు "య" కారము తెలుగుమాటలకు మొదట లేదని తెల్పెను. అట్టులు చెప్పుటవలన యెవడు, యెక్కడ మున్నగు పదములందలి ఆదిమవ్యంజనమునకు లోపమై అచ్చు మిగులును. అప్పుడు ఎవఁడు, ఎక్కడ అనునవియే రూపములు– ఎవఁడు, ఎక్కడ, ఏమి, ఏల, ఉండ, ఊరు, ఒకఁడు, ఓడ.

హరి యతఁడు–సంధి లేనిచో యడాగమ మగు ననుటచే వచ్చినది. కాని పూర్వసిద్ధము కాదు.

నిద్రవోయె–ప్రథమమీఁది క చ ట త ప లకు గ స డ ద వ లు బహుళముగా నగు ననుటవలన "పో" స్థానమున వచ్చిన "వో" యే కాని పూర్వసిద్ధము కాదు.

ఇంతవరకు సంస్కృతసమేతరములను గూర్చి చూచితిమి. సంస్కృతసమములందు సైతము "వోఢృ, వోఢవ్య" శబ్దములు దప్ప "వు వూ వో" వర్ణాదులగు శబ్దములు లేవు. సంస్కృతసమములం దనుటచేత తెలుగున లేవని యర్థము. సంస్కృత కావ్యములందు కోశములందు "వోఢజః, వోఢా" మున్నగు శబ్దములు కొన్ని యుండవచ్చును. కాని వానికి ప్రసక్తి లేదు. తెనుగున సంస్కృతసమశబ్దములకు ఉదాహరణములు : ఉదకము, ఊర్మిక, ఓదనము మున్నగునవి.

## లఘ్వలఘువిభాగము (18)

య ర ల వలు లఘువులని యలఘువు లని రెండు విధములగును. స్థాన కరణ స్పర్శములందలి భేదమునుబట్టి యీ నిర్ణయము.

ఉచ్చారణమున శైథిల్యము గలవి లఘువులు; లేనివి అలఘువులు.

హరి యతఁడు – ఇందలిది ఆగమ యకారము. ఇది లఘువు. తక్కిన యకారము అలఘువు.

అసోఁడు వలికె– ఇందలిది "పా"కు ఆదేశముగా వచ్చిన వకారము. ఇది లఘువు. తక్కిన వకారము అలఘువు. శబ్ద సిద్ధము లయిన "య వ"లు అలఘువు లని, శాస్త్రసాధ్యము లయిన "య వ"లు లఘువులని నిర్ణయము.

పెరుగు, కరుగు మున్నగు శబ్దములందలి రేఫము లఘువు.

విఱుగు, మెఱుఁగు మున్నగు శబ్దములందలి రేఫము అలఘువు. దీనినే శకటరేఫ మని యందురు.

శకటరేఫము తత్సమ తద్భవములందు లే దని సూరి యొక నిర్ణయము చేసెను. కాని అది యంత సమంజసముగా కనిపింపదు. తత్సమములందు శకటరేఫము లేదు. కాని తద్భ వములందు గలదు. మూర్ఖ- మొఱకు; పర- పెఱ; గోరో చనము– గోఱజము; భీరుక–పిఱికి; క్షురరీ–గొఱ్ఱె మున్నగు తద్భవరూపములం దున్నది శకటరేఫ మనుట స్పష్టము.

ఏళులు, పాళులు, ౹ తాళు లని బహుత్వమందు ర ల డ ల కాదేశమయిన ళ కారము అలఘువు. ఏరు–ఏళులు; పాలు– పాళులు; ౹ తాడు– ౹ తాళులు.

తల, నెల మున్నగువానియందలి ల కారము లఘువు. శబ్దమునందు సహజసిద్ధముగా నున్న ళ కారము వర్ణాంతరము; వర్ణ సమామ్నాయ మందలి కడపటి వర్ణము. ఇది అలఘు ళ కారము కాదు - కళ, మంగళము మున్నగునవి.

## త త్స మ ము [19]

సంస్కృత ప్రాకృతతుల్యం బగు భాష తత్సమంబు. సంస్కృతముతో గాని, ప్రాకృతముతో గాని తుల్య మయిన భాష తత్సమము. సంస్కృతము ప్రాతిపదికగా తెలుగు ప్రక్రియను బట్టి రూపొందిన భాష తత్సమ మగును- రామః-రాముఁడు. ఉత్వడుజ్ఞులు విధింపగా ఏర్పడిన రూపము.

ప్రాకృతతుల్యత్వముకూడ ఇట్లే: అగ్గీ-అగ్గి.

ఇక్కడ శబ్దావయవమునందు మార్పులేక తెలుగు విభక్తి చేరికయు దానివలన కొలది మార్పులును గలిగినవి.

## త ద్భ వ ము [20]

సంస్కృతప్రాకృతభవం బగు భాష తద్భవము.

సంస్కృత శబ్దములందును, ప్రాకృత శబ్దములందును వ్యవహారమువలన వర్ణాగమము, వర్ణాదేశము, వర్ణలోపము, వర్ణవ్యత్యయము, భిన్నత్వము మున్నగు మార్పులు వచ్చును. అట్లు మార్పులు పొందిన శబ్దములు తద్భవములు.

| | | | | |
|---|---|---|---|---|
| ఆకాశః | — | అకసము | — | వర్ణాదేశము |
| కుడ్యమ్ | — | గోడ | — | భిన్నత్వము |
| తామరసమ్ | — | తామర | — | వర్ణలోపము |
| పారావతః | — | పావురము | — | వర్ణ వ్యత్యయము |
| చన్ద్రః | — | చందురుఁడు | — | వర్ణాగమము. |

## దేశ్యము [21]

త్రిలింగదేశ వ్యవహారసిద్ధం బగు భాష దేశ్యము. శ్రీశైలము, కాళేశ్వరము, దక్షారామము అను మూడు శివ క్షేత్రముల ప్రదేశము త్రిలింగదేశము. అందు వ్యవహారమున నుండు భాష ఆంధ్రదేశ్యము. ఊరు, పేరు, ఇల్లు, ముల్లు, కోట, పేట, దూడ, మేడ, కోఁత, లేఁత, తావి, మోవి మున్నగునవి ఉదాహరణములు.

## గ్రామ్యము [22]

లక్షణవిరుద్ధం బగు భాష గ్రామ్యము. వ్యాకరణలక్షణములకు సరిపడని భాష గ్రామ్యము. వ్యాకరణము మహాకవుల ప్రయోగములను మూలముగా చేసికొనును. అందువలన మహాకవులకు సమ్మతము కాని భాషను కావ్యములందు ప్రయోగింపరా దని చిన్నయసూరి నిర్ణయించెను. వస్తాఁడు, తెస్తాఁడు, వచ్చేని, తెచ్చేని, వచ్చేవాఁడు, తెచ్చేవాఁడు, వచ్చేటివాఁడు, తెచ్చేటివాఁడు - పై ఉదాహరణములందు సూరి అర్ధానుస్వారములను నిలిపెను. వ్యవహారమున అర్ధాను

స్వారమునకు ఉచ్చారణ లేనందువలన వానిని నిల్పకుండుట భావ్యము.

## ఆ ర్య వ్య వ హా ర ము [23]

ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు.

వ్యాకరణము ప్రయోగశరణము. పెద్దల వ్యవహారమందు ప్రయోగించిన శబ్దములు గ్రామ్యములే ఐనను గ్రహింపనగును. కఱకంఠుఁడు, ప్రాణగొడ్డము, జీవగఱ్ఱ, కపిలకన్నులు, కపిలగడ్డము, కపిలజడలు; పై వన్నియు దుష్టసమాసములు. "కేవల సంస్కృతశబ్దము వికృతిశబ్దముతోడ సమసింపదు" అని సమాస పరిచ్ఛేదమున మూడవ సూత్రమున సూరి తెల్పెను. పై ఉదాహరణములందు మొదటి సమాసమున పూర్వపదము తెలుగు, ఉత్తరపదము సంస్కృతము. తక్కిన యన్నింటియందు పూర్వపదము సంస్కృతము, ఉత్తరపదము తెలుగు. చివరి మూడు ఉదాహరణములు భారతమునందలివి. నేటి ముద్రితప్రతులందు "కవిలగడ్డము" మున్నగు రూపములు కన్పించుచున్నవి. అందును వ కారము ప్రాస. కావున ఆ మూడింటిని తొలగించినను మొదటి మూడు ఉదాహరణములును ఈ సూత్రమునకు అవకాశమును గలిగించుచున్నవి.

# సంధిపరిచ్ఛేదము

బాలవ్యాకరణమున రెండవది సంధిపరిచ్ఛేదము. సంధి కార్యములను తెలుపు పరిచ్ఛేదము కనుక సంధిపరిచ్ఛేద మని పేరు. సంధికి వర్ణద్వయమేళన మనియు, సంహిత యనియు రెండర్థములు చెప్పఁకొనవచ్చును. "ఆద్యంత వర్ణయోరైక్యం సంధిః" అనుటవలన ఆద్యంతవర్ణముల మేళనము సంధియగును. దీనినే చిన్నయసూరి "పూర్వపరస్వరంబులకుం బరస్వరం బేకాదేశం బగుట సంధి యనంబడు" అనెను. చిన్నయసూరి సంధి యను సంజ్ఞకు చేసిన నిర్వచనము కేవల స్వరసంధికి మాత్రము నియతము.

రెండవయర్థము సంహిత. "వర్ణానా మతిశయితః సన్నిధిః సంహితా". వర్ణముల అత్యంతమైన సామీప్యము సంహిత. ఇక్కడ వర్ణములు అనగా అచ్చులు మాత్ర మని యర్థము కాదు, హల్లులు ఒకదానితో ఒకటి మిక్కిలి సన్నిహితముగా ఉండుట సంహిత. దీనినే పూర్వవ్యాకర్తలు హల్సంధి యనిరి.

సూరి ఉద్దేశమున సంధి యనగా స్వరసంధియే. హల్సంధిని సంధియనుట ఆయనకు సమ్మతము కాదు. అందువలననే ఈ పరిచ్ఛేదమున మొదటి పదునొకండు సూత్రములవరకే ఆయన సంధి యను పదము నుపయోగించెను. అంతవరకు మాత్రమే ఆయన సంధికి చేసిన నిర్వచనము సమన్వయించును.

తరువాత ఈ నిర్వచనము సమన్వయింపదు. కావుననే చిన్నయ సూరి తరువాతి సూత్రములందు సంధి యను పదమును ఉపయోగింపలేదు.

అయినచో వానిని సంధిపరిచ్ఛేదమున చేర్చుట యేల? అను ప్రశ్న ఉదయించును. పరిచ్ఛేదమునకు పేరుపెట్టు సందర్భమున సంప్రదాయము ననుసరించి సంహితార్థముననే సంధి శబ్దము నుపయోగించెను. అంతేకాక, ఇతర ప్రకరణము లన్నియు ఇతరవిషయములకై వినియోగింపబడినవి. సంధి పరిచ్ఛేదము మాత్రమే సంహితను గూర్చి చెప్పుటకు తగినది; కొంత సంబంధమును కలిగినది. అందువలన సంధి యను పదమునకు నిర్వచనము నిచ్చుచు స్వరసంధినే ఉద్దేశించినను, పరిచ్ఛేదమందు హల్సంధికి కూడ అవకాశమును కలిగించెను.

## ఉకారసంధి [1, 2]

ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు. ఉత్తు అనగా హ్రస్వమయిన ఉకారమని యర్థము. ఉద్దేశించిన యక్షరమునకు పైని "త"కారమును చేర్చి పలుకుటకు "తపర కరణము" అని పేరు. తపరకరణమువలన ముందరి అక్షరము దీర్ఘమో, హ్రస్వమో స్పష్టముగా ఎరుగుటకు అవకాశము గలదు. అత్తు, ఇత్తు, ఉత్తు—హ్రస్వము లయిన అ, ఇ, ఉ లను తెలుపును; ఆత్తు, ఈత్తు, ఊత్తు—దీర్ఘము లయిన ఆ ఈ ఊ లను తెలుపును. అటుకాక అకారము, ఇకారము,

ఉకారము అని ఉపయోగించినచో హ్రస్వదీర్ఘములు రెండును అర్థమగును.

రాముఁడు + అతఁడు = రాముఁడతఁడు
సోముఁడు + ఇతఁడు = సోముఁడితఁడు
మనము + ఉంటిమి = మనముంటిమి
అతఁడు + ఎక్కడ = అతఁడెక్కడ
ఇతఁడు + ఒకఁడు = ఇతఁడొకఁడు

పై ఉదాహరణములందు పూర్వపదముల కడపటి యక్షరములు ఉత్తుతో కలిసిన వ్యంజనములు. "డు" అనగా "డ్ + ఉ" అని విభాగము. అందువలన పూర్వపదము చివర ఉత్తు ఉన్నదనుట నిశ్చితము. పరమందున్న పదము "అతఁడు" మొదటివర్ణము 'అ'. రెండింటికి సంధి రాగా రెండింటికి బదులుగా పరస్వరమైన 'అ' ఆదేశముగా వచ్చును. అప్పుడు "రాముఁ డతఁడు" అని యగును.

"శత్రువదాదేశః" అనుటచే శత్రువువలె వచ్చునది ఆదేశమని యర్థము. పూర్వమందున్న వర్ణమును దొలగించి తత్స్థానమున నిల్చునది ఆదేశము. పై ఉదాహరణమందు "ఉ" స్థానమున "ఉ"ను తొలగించి "అ" నిల్చినది. పరమందున్న "అ" స్థానమునగూడ అదియే నిల్చినది. అందువలననే సూరి ఏకాదేశమని యుపయోగించెను. రెండింటిస్థానమున నొక్కటియే నిల్చుట ఏకాదేశము.

పై ఉదాహరణములందు పరవర్ణముగా అచ్చుల నన్నింటి నిచ్చి ఋ ౠ వర్ణములను విడిచిపెట్టెను. దానికి కారణము—ప్రకీర్ణక పరిచ్ఛేదము మొదటిసూత్రమున "ఋ ౠ" వర్ణములు "రల"లవంటి వనెను. అందువలన పరపదాదిమ వర్ణములు వ్యంజనము లగుచున్నవి—అతడు+ఋషి=అతడు ఋషి యనియే యగును. పూర్వాపరవర్ణములు సన్నిహితమైనవుడే సంధిగాని యడాగమముగాని యగును. సూరి "ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు" అని సూత్రించెను. "అగును" అనుటవలన నిత్యముగా నగు నని యర్థము. దీనినిబట్టి ఉత్తున కచ్చువరమగునపుడు సంధిని నిత్యముగా విధించెను.

కాని, తరువాతిసూత్రమున దానిని గొంత సడలించెను. ప్రథమేతర విభక్తి, శత్రర్థ చువర్ణములందున్న ఉకారమునకు సంధి వైకల్పికము అనెను.

వైకల్పిక మనగా ఒకమాఱు వచ్చుట, ఒకమారు రాకుండుట. వచ్చుటవలన ఒకరూపము, రాకుండుటవలన మరొకరూపము—అనగా ఒక్కొక్కదానికి రెండేసి రూపము లుండును.

ప్రథమేతర విభక్తులు అనగా ద్వితీయ మొదలుకొని సప్తమివరకు గల విభక్తులు. కాని వీనిలో మనకు ఉదంతములు మాత్రమే గ్రాహ్యములు. అవి "ను, కొఱకు, కు, అందు" అను నవి. ఈ నాలుగును ద్రుతప్రకృతికములు. సంధి వచ్చినపుడు

వీనిలోని ఉకారము పరమందున్న అచ్చుతో సంధి నొందును. సంధి లేనప్పుడు వీని కడపటిద్రుతము పరమందున్న అచ్చును బొంది పూర్వపరాచ్చులకు మధ్య నిల్చును.

నన్నున్ + అడిగె = { నన్నడిగె / నన్నునడిగె }

నాకొఱకున్ + ఇచ్చె = { నాకొఱ కిచ్చె / నాకొఱకు నిచ్చె }

నాకున్ + ఆదరువు = { నా కాదరువు / నాకు నాదరువు }

నా యందున్ + ఆశ = { నాయం దాశ / నాయందు నాశ }

పై ఉదాహరణములందు మొదటివి సంధి వచ్చిన రూపములు; రెండవవి సంధి రాని రూపములు.

సూత్రమునందు చెప్పకున్నను సూరి యింకను రెండు ఉదాహరణము లిచ్చెను. పై ఉదాహరణములలో చివరిదైన "అందు "సప్తమీవిభక్తి ప్రత్యయము. దానివలెనే కన్పించునవి "ఇందు, ఎందు" అని రెండుశబ్దములు కలవు. ఇవి ప్రత్యయములు కావు. వీనిని ప్రత్యయప్రతిరూపము లని అందురు. వీనిని కూడ సూరి ఉదాహరించెను.

ఇందున్–ఉన్నాఁడు = ఇందున్నాఁడు; ఇందు నున్నాఁడు

ఎందున్ – ఉంటివి = ఎందుంటివి; ఎందు నుంటివి

శత్రర్థచువర్ణము అనగా వర్తమానకాలమునవచ్చు "చు" వర్ణము. క్రియాపరిచ్ఛేదమున నలువది మూడవసూత్రమున సూరి "చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున శత్రర్థంబునం దగు" అనెను. ఆ శత్రర్థక చువర్ణమునందలి ఉత్వమునకే ప్రస్తుతము వికల్పక సంధిని విధించెను.

వచ్చుచున్ + ఉండెను = వచ్చుచుండెను; వచ్చుచునుండెను.
చూచుచున్ + ఏగెను = చూచుచేగెను; చూచుచునేగెను.

సంధి యగునపుడు విధానసామర్థ్యమున ద్రుతము లోపించును. అందువలననే సూరి శాస్త్రమర్యాదనుబట్టి ఆ విషయమును స్పష్టముగా చెప్పకుండ విడిచిపెట్టెను.

## యడాగమము (3)

"సంధి లేనిచోట స్వరంబుకంటెం బరం బయిన స్వరంబునకు యడాగమం బగు." సూత్రవిధిచేత సంధి జరుగనియెడల పరస్వరమునకు యడాగమ మగు నని యర్థము.

"మిత్రవదాగమః" అనుటచే ఆగమము పూర్వమున్న యక్షరములను దొలగింపకుండ వాని సరస జేరును. ఆగమము వర్ణాధిక్య మని సూరి నిర్వచనము. ఉన్నయక్షరములకంటె అదనముగా వచ్చి చేరును.

"యట్" అనగా య కారము. ట కారము టిత్తు. "ఆద్యంతౌ ట కితౌ". టిత్తుగా విధింపబడినది ఆదియందును, కిత్తుగా విధింపబడునది అంతమందును చేరు నని యర్థము.

ఇక్కడ "యట్" అనుటవలన "య" కారము పరస్వరము నకు ముందు నిల్చును. యకార మనిన పొల్లు యకార మనియే భావము. ఉచ్చారణసౌకర్యమునకై "యట్" అని యకార ముపై అచ్చుచేర్చుచున్నాము.

మా+అమ్మ=మా యమ్మ (మా+య్+అమ్మ)

మీ+ఇల్లు=మీ యిల్లు (మీ+య్+ఇల్లు)

"సంధి లేనిచోట" అనుటచే రెండు స్వరములు సన్నిహితములైనప్పు డనియే గ్రహింపవలయును. సంధి యగుటకు తగిన స్థితి యుండి సంధి రానిచో అప్పుడుమాత్రమే పరస్వరమునకు యడాగమ మగును. వ్యంజనాక్షరమునకు పరమందున్న స్వరమునకు యడాగమము రాదు. దానిని స్పష్టము చేయుటకే సూరి "స్వరంబుకంటెం బరం బయిన స్వరంబునకు" అనెను.

## అ త్వ సం ధి (4)

అత్తునకు సంధి బహుళముగా నగు. బహుళ మనగా అనేకవిధములుగా నని యర్థము. కాని వ్యాకర్తలు ప్రవృత్తి, అప్రవృత్తి, విభాష, అన్యత్వము – అని అర్థవిశేషములను నాలుగు విధములుగా చెప్పిరి. ప్రవృత్తి యనగా నిత్యముగా వచ్చుట; అప్రవృత్తి యనగా నిత్యముగా రాకుండుట; విభాష అనగావచ్చుటయు రాకుండుటయు రెండును అగుట; అన్యత్వము అనగా మరొకసూత్రము ప్రవర్తించుటవలన వేరు విధముగా అగుట.

ఈ నాలుగు విశేషములును బాహుళకమును విధించి నపుడెల్ల వర్తిల్ల నక్కరలేదు. ఇక్కడ విభాషకు క్రిందివి ఉదాహరణములు-

| | | | | |
|---|---|---|---|---|
| మేన | + | అల్లుఁడు | = | మేనల్లుఁడు / మేన యల్లుఁడు |
| పుట్టిన | + | ఇల్లు | = | పుట్టినిల్లు / పుట్టిన యిల్లు |
| చూడక | + | ఉండెను | = | చూడకుండెను / చూడక యుండెను |

మొదటివి సంధి వచ్చిన రూపములు; రెండవవి సంధి రాని రూపములు.

బహుళగ్రహణముచేత స్త్రీవాచక తత్సమ సంబోధ నాంతములకు సంధి లేదు. స్త్రీలను చెప్పునట్టి పదములకు, సంస్కృత ప్రాకృత తుల్యము లగు పదములకు, అంతమందు సంబోధనమును గల పదములకును సంధి లేదని యర్థము. ఇది అప్రవృత్తి.

| | | | | |
|---|---|---|---|---|
| అమ్మ | + | ఇచ్చెను | = | అమ్మ యిచ్చెను |
| దూత | + | ఇతఁడు | = | దూత యితఁడు |
| చెలువుఁడ | + | ఇందము | = | చెలువుఁడ యిందము |

అమ్మ స్త్రీవాచకము- దూత తత్సమము- చెలువుఁడ సంబోధనాంతము. అందువలననే సంధి రాక స్వరంబుకంటెం బరం బయిన స్వరంబునకు యడాగమమైనది.

"ఆధునికకృతులం దొకానొకచోట స్త్రీవాచక తత్స మంబులకు సంధి గానంబడియెడు."

గంగ + అనుకాసె = గంగనుకాసె

గంగ తత్సమము- అందువలన సంధి కారాదు. అయినను కవి ప్రయోగించెను. అట్లే నెలఁత+ఇచ్చెను=నెలఁత యిచ్చెను అని కావలసియుండగా "నెలఁతిచ్చెను" అని స్త్రీ వాచకమునకు కవి సంధిచేసెను.

"వెలయాల్వాదుల సంధి లేమి బాహుళకముచేతనే యని యూహించునది". వెల + ఆలు = వెలయాలు అని మాత్రమే యగుచున్నది. "వెలాలు" అను రూపము లేదు. ఇక్కడకూడ సూత్రమునకు అప్రవృత్తియే.

'సంస్కృతీయంబునకు సంధి యగు నని యథర్వణాచార్యులు చెప్పిరి గాని దానికిం బూర్వకావ్యంబులందుఁ బ్రయోగంబు మృగ్యంబు.' మృగ్యము అనగా వెదకదగిన దని యర్థము; లేదు అనియే భావము. "క్వచిత్ సంస్కృతీయోఽపి ప్రాణోఽవ్యత శ్చ్యుతో భవేత్" అని అథర్వణాచార్యు లనెను. ఒకానొకప్పుడు సంస్కృతీయ మగు స్వరము కూడ లోపించిన దగును అని అర్థము. దానికి వ్యాఖ్యవ్రాయుచు అహోబలపతి "సంస్కృత సమాంత స్థితస్యాచోఽపి క్వచిత్సంధిః" అనెను. సంస్కృతసమముల అంతమందున్న

అచ్చునకుకూడ కొన్నిచోట్ల సంధియగునని యర్థము. చిన్నయ సూరి ఇట్టిది మృగ్యము అని వ్రాసి నిరాకరించెను.

కాని పై అథర్వణుని కారిక అయ్య, అన్న మున్నగు పూజ్యతావాచకాదిపదములు పరమందున్నపుడు సంస్కృతీయములకును సంధి యగు ననియే తెల్పెను. దీనిని గ్రహించియే ప్రౌఢవ్యాకరణకర్త సంధిపరిచ్ఛేదము మొదటనే "శ్రేష్ఠతావాచకంబు లగు నార్యాంబాద్యర్థకశబ్దములు పరంబు లగుచో నన్నియచ్చులకును సంధి నిత్యము" అని సూత్రించెను- దీనివలన రామ + అయ్య = రామయ్య అని సీత + అమ్మ=సీతమ్మ అని సిద్ధించుచున్నవి. సూరి బాహుళక మని తెల్పి విభాషకు, అప్రవృత్తికి మాత్రమే యుదాహరణములు చూపెను. ఈ ప్రౌఢవ్యాకరణసూత్రము ప్రవృత్తికి ఉదాహరణము కాగలదు.

## ఇ త్వ స ం ధి [5-8]

"ఏమ్యాదుల యిత్తునకు సంధి వైకల్పికముగా నగు" ఏమి, మఱి, కిషష్ఠి, అది, అవి, ఇది, ఇవి, ఏది, ఏవి- ఇది ఆకృతిగణంబు. ఆకృతిగణము అనగా పోలికనుబట్టి యూహింపదగిన గణ మని యర్థము. "ఇత్తు" నకు అనక "ఏమ్యాదుల యిత్తునకు" అని యనుటవలన అన్నియికారములకును సంధి చేయరాదని తేలుచున్నది.

ఏమి + అంటివి = ఏమంటివి; ఏమి యంటివి
మఱి + ఏమి = మఱేమి; మఱియేమి
హరికిన్ + ఇచ్చె = హరికిచ్చె; హరికి నిచ్చె

కిషష్ఠి యనగా షష్ఠీవిభక్తి ప్రత్యయమైన "కి" యని యర్థము. సూరి మతమున షష్ఠీవిభక్తి ప్రత్యయము "కు" అనునదే కాని "కి" కాదు. తత్సమపరిచ్ఛేదమందలి "ఇకారంబుమీఁది కునువు క్రియావిభక్తుల యుత్వంబున కిత్వంబగు" అను ఇరువదారవ సూత్రముచేత "హరి+కు" అన్నప్పుడు "కు" లోని ఉకారము ఇత్వమును బొంది "కి" ఐనది. ఇట్టిది కిషష్ఠి.

క్రియాపదములం దిత్తునకు సంధి వైకల్పికముగా నగును.

వచ్చిరి + అప్పుడు = { వచ్చి రప్పుడు / వచ్చిరి యప్పుడు }
వచ్చితిమి + ఇప్పుడు = { వచ్చితి మిప్పుడు / వచ్చితిమి యిప్పుడు }

"వచ్చిరి" అనునది ప్రథమపురుష బహువచనము. "వచ్చితిమి" ఉత్తమపురుష బహువచనము. రెండును భూతకాలికములు. భూతకాలిక ప్రథమపురుష బహువచన రూపమందలి కడపటి యిత్తునకు, భూతకాలికమైన ఉత్తమపురుష బహువచన రూపమందలి కడపటియిత్తునకు సంధి వికల్పమని తేలినది.

ఏకవచనమున ప్రథమపురుష "వచ్చెను" అగును. కావున ఇత్వసంధివిషయమున దాని ప్రసక్తి లేదు. ఏకవచన

మున ఉత్తమపురుష "వచ్చితిని" అగును. ఇది ద్రుతప్రకృతికము. "ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధిలేదు" అను తొమ్మిదవ సూత్రమువలన దీనికి సంధి నిషేధింపబడినది. "వచ్చితి నిప్పుడు" అనునది సంధి రాని రూపము. కావున భూతకాలోత్తమపురుషైక వచనమునకు సంధిలేదు.

ఉత్తమ ప్రథమపురుషలను గూర్చి చెప్పినపిమ్మట సూరి "మధ్యమ పురుషక్రియలయం దిత్తునకు సంధి యగు" నని నిత్యత్వమును విధించెను.

ఏలితివి + అపుడు = ఏలితివపుడు
ఏలితి + ఇపుడు = ఏలితిపుడు
ఏలితిరి + ఇపుడు = ఏలితిరిపుడు

"క్త్వార్థంబైన యిత్తునకు సంధి లేదు" క్త్వార్థ మనగా వచ్చి, పోయి, చూచి మున్నగు భూతకాలికమైన అసమాపక క్రియలను దెల్పునది. క్త్వార్థమైన యికారమునకు సంధిని సూరి నిషేధించెను. వచ్చి+ఇచ్చెను=వచ్చియిచ్చెను అనియే కావలయును; వచ్చిచ్చెను కారాదు.

ఈ విషయమున సూరికి పట్టుదల యెక్కువ. పదవ సూత్రమున ఆమ్రేడితమునుగూర్చి చెప్పుచు, పనికట్టుకొని "ఏగి ఏగి యనుచో క్త్వార్థం బగుట సంధిలేదు" అనెను.

కాని చిన్నయసూరి సంస్కృతమున వ్రాసిన "సూత్రాంధ్ర వ్యాకరణము"న "క్త్వాపిసవర్ణేదృశ్యతే" అని

అక్కడక్కడ క్త్వార్థకమైన ఇత్వమునకు సవర్ణములతో సంధి కన్పించుచున్న దని అంగీకరించెను. దీనినిబట్టి ఇత్వమునకు ఇ ఈ ఎ ఏ లతో సంధి జరుగుచున్నదనియే అంగీకరించి నట్లయినది.

నన్నయ కావ్యమున క్త్వార్థకారసంధి లేదు. తిక్కన కూడ భారతమున నెక్కడను చేయలేదు. తరువాతి గ్రంథము లందు "ఎతింగెటింగి" మున్నగు చోటులందువలె ఇత్వమునకు సవర్ణముతో సంధి అక్కడక్కడ కనబడుచున్నది. కావుననే సూరి మహాకవిప్రయోగము కానందువలన దీనిని తన చివరి రచనమైన బాలవ్యాకరణమున "క్త్వార్థంబైన యిత్తునకు సంధి లేదు" అని నిత్యముగా నిషేధించెను.

## ద్రుత ప్రకృతిక సంధి [9]

"ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదు"

ఇఁక, ఇఁగ, ఎట్టకేలకు, ఎట్టకేని- ఈయవి యిఁకాదు లని యెఱుంగునది. వీనికి సంధి వైకల్పికము.

| | | | | |
|---|---|---|---|---|
| ఇఁకన్ | + | అనెను | = | ఇఁ కనెను<br>ఇఁక ననెను |
| ఇఁగన్ | + | అతఁడు | = | ఇఁ గతఁడు<br>ఇఁగ నతఁడు |
| ఎట్టకేలకున్ | + | ఆమె | = | ఎట్టకేల కామె<br>ఎట్టకేలకు నామె |

ఎట్టకేనిన్ + ఉండెను = { ఎట్టకే నుండెను / ఎట్టకేని నుండెను

పై విధముగా వైకల్పిక సంధి వచ్చును. వీనికి కాక, తక్కిన ద్రుతప్రకృతికములకు సంధి లేదని నిషేధించుట ఈసూత్రమున ప్రథమ భాగము. తక్కిన ద్రుతప్రకృతికములకు సంధి లేదు.

వచ్చున్ + ఇపుడు = వచ్చునిపుడు (తద్ధర్మార్థకము)
చూడన్ + అయితి = చూడనయితి (వ్యతిరేకార్థకము)
ఉండెడిన్ + అతఁడు = ఉండెడినతఁడు (తద్ధర్మార్థకము)

ఇట్లే మిగిలిన ద్రుతప్రకృతికరూపములకును సంధి లేదని యర్థమగుచున్నది. కాని "ప్రథమేతర విభక్తి శత్రర్థ చువర్ణంబు లందున్న యుకారంబునకు సంధి వైకల్పికంబుగా నగు" అను రెండవసూత్రముచేత నన్నున్, నాకొఱకున్, నాయందున్, ఇందున్, ఎందున్, వచ్చుచున్ వంటి ద్రుతప్రకృతికములకు వైకల్పికసంధి విధింపబడినది.

తొమ్మిదవసూత్రమే సర్వత్ర వర్తించినచో రెండవ సూత్రము ప్రవర్తించుటకు అవకాశమే యుండదు. అందువలన సూత్రము నిష్ప్రయోజక మగును. "నిరవకాశాహి విధయ స్సావకాశాన్ విధీన్ బాధన్తే" నిరవకాశము లయిన విధులు సావకాశము లయిన విధులను బాధించునని యర్థము. తొమ్మిదవసూత్రము సావకాశము. రెండవసూత్రము ప్రవర్తించినను తొమ్మిదవసూత్రము ప్రవర్తించుట కింకను అవకాశము గలదు.

కావున నిరవకాశమగు "ప్రథమావిభక్తి"సూత్రము సావకాశ మగు ఇఁకాదుల సూత్రమును బాధించును. అనఁగా ప్రథమేతరవిభక్తి, శత్రర్థచువర్ణములం దున్న ఉకారమునకును, ఇఁకాదులకును దప్ప ద్రుతప్రకృతికములకు సంధి పూర్తిగా నిషేధింపబడిన దని పిండితార్థము.

## ఆమ్రేడితసంధి [10]

"ద్విరుక్తముయొక్క పరరూప మామ్రేడిత మనంబడు."
ఒకేమాట రెండుసారు లుచ్చరింపబడినచో, అందు రెండవ సారి ఉచ్చరింపబడినమాటను "ఆమ్రేడితము" అని యందురు.

"అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు సంధి తఱుచుగ నగు."

| | | | | |
|---|---|---|---|---|
| ఔర | + | ఔర | = | ఔరౌర |
| ఆహా | + | ఆహా | = | ఆహాహా |
| ఓహో | + | ఓహో | = | ఓహోహో |
| ఎట్టా | + | ఎట్టా | = | ఎట్టెట్టా |

తెలుగునందు దీర్ఘమునకు సంధి వచ్చు ప్రదేశ మిది యొక్కటియే. సంధి తఱుచుగ నగు ననుటచేత ఒకానొక చోట వికల్పసంధికూడ కల దని తాత్పర్యము.

ఏమి + ఏమి = ఏమేమి; ఏమియేమి.

క్త్వార్థంబైన యి కారమునకు సంధి లేదు అను నిషేధము వలన "ఏగి"చివరి "ఇ" త్వమునకు ఆమ్రేడితము పర

మైనప్పుడు సంధి కాదు. సంధికానిచో యడాగమ మగును కనుక "ఏగి యేగి" అను రూప మొక్కటియే యేర్పడును.

## పదమధ్యసంధి (11)

"అంద్వవగాగమంబులు దప్ప నపదాదిస్వరంబు పరం బగునపు డచ్చునకు సంధి యగు."

అపదము అనగా ప్రత్యయము, ఆగమము మున్నగునది. అందు – సప్తమీవిభక్తి ప్రత్యయము; అవ – పూరణార్థము నందగు ఆగమము.

ఇవికాక ఇతరప్రత్యయములు కాని, ఆగమములు కాని పరం బగునపుడు సంధి యగు.

మూర + ఎఁడు = మూరెఁడు } పరిమాణార్థక ప్రత్యయము
వీసె + ఎఁడు = వీసెఁడు

అర్థ + ఇంచు = అర్థించు } ఇంచుగాగమము
నిర్జి + ఇంచు = నిర్జించు

అందు, అవ అనునవి పర మగునపుడు యథాసంభవ ముగా గ్రహింపవలయును. అనగా ప్రయోగమునుబట్టి తెలిసి కొనవలయు నని యర్థము.

రాముల + అందు = రాములందు; రాములయందు
హరి + అందు = హరియందు
ఎనిమిది + అవ(ది) = ఎనిమిదవది; ఎనిమిదియవది

పదమునకు పదమునకు గల్గు సంధికాక, పదమునకు అపదమునకు వచ్చు సంధి యగుటచే దీనిని "పదమధ్యసంధి" అందురు. ఇంతవరకు సూరి చేసిన నిర్వచనమునకు సరిపడునట్టి సంధినిగురించి చూచితిమి. ఇది స్వరసంధి.

## దిరుక్త టకారము [12]

ద్విరుక్తము, ద్విత్వము, ద్విర్వచనము అనునవి సమానార్థకములు. ద్విరుక్తటకార మనగా టకారము పునరుక్తమగుట.

"కుఱు చిఱు కఱు నడు నిడు శబ్దముల ఱ డ లకచ్చు పరమగునపుడు ద్విరుక్తటకారం బగు"

కుఱు + ఉసురు = కుట్టుసురు

"కుఱు" నకు చిట్టచివరి యక్షరము ఉత్వవిశిష్టమైన "ఱు". దానికి పరమందు 'ఉసురు' లోని మొదటి వర్ణము "ఉ" ఉన్నది. అందువలన "ఱ" కు ద్విరుక్తటకారము (ట్ + ట్) వచ్చినది. పూర్వశబ్దమున "ఱ" ఉత్వవిశిష్టము కావున ద్విరుక్తటకారము కూడ ఉత్వవిశిష్టమే కావలయును (ట్ + ట్ + ఉ). ఇట్లు ఏర్పడిన రూప మిది-

కుట్టు + ఉసురు

సంధి రాగా "కుట్టుసురు" అయినది. ఇట్లే

| | | | | |
|---|---|---|---|---|
| చిఱు | + | ఎలుక | = | చిట్టెలుక |
| నడు | + | ఇల్లు | = | నట్టిల్లు |
| నిడు | + | ఊరుపు | = | నిట్టూరుపు |

కుఱు, చిఱు, నడు, నిడు- అను శబ్దములకు ప్రాథమిక రూపములు కుఱుచ, చిఱుత, నడుము, నిడుద అనునవి. ఆచ్ఛిక వృత్తియందు వాని కడపటి యక్షరములు లోపించును. అప్పు డవి పైవిధముగా నేర్పడును. కుట్టుసురు మున్నగునవి సమస్త పదములు. వ్యస్తములైనపుడు కుఱుచ యుసురు, చిఱుత యెలుక, నడుమిల్లు, నిడుదయూరుపు- అని కావచ్చును. సూత్రమున సూరి సమాసమునం దని చెప్పకున్నను సమాసవృత్తి యందుమాత్రమే యగు అంతిమాక్షరలోపముగల పదములనే ఉదాహరణయందు పేర్కొనుటవలన ఈ సంధి సమాస విధియందే ప్రవర్తించు నని చెప్పనగును. దీనిని గమనింపని కొందరు

"కడు + ఎదురు=కట్టెదురు" అను ఉదాహరణమును జూచి సూరి యిక్కడ ద్విరుక్తటకారవిధి వైకల్పిక మని సవరించుకొనవలసిన దని నిర్ణయించుచున్నారు. ఆ నిర్ణయము భ్రాంతిమూలకము. సమాసమైనపుడు

"కడు+ఎదురు=కట్టెదురు" అనియే యగును. సమాసము కానపుడు

"కడు+ఎదురు = కడునెదురు" అని యగును. కడు నడలు, కడునెండ మున్నగు ప్రయోగము లిట్టి వ్యస్తరూపములు.

## గ స డ ద వ లు [13-15]

"ప్రథమమీఁది పరుషములకు గ స డ ద వ లు బహుళముగా నగు." పరుషము లయిన క చ ట త ప లతో పాటు దంత్యచకారముకూడ గ్రాహ్యము.

ప్రథమావిభక్తిప్రత్యయములు- డు, ము, వు- లు, మొదటి మూడును ఏకవచనమున, నాలుగవది బహువచనమున వచ్చును.

ప్రథమమీఁద వచ్చిన పరుషములకు గ స డ ద వ లు బహుళముగా నగును. అనుటచే

| | | | |
|---|---|---|---|
| వాఁడు | +కొట్టె | =వాఁడుగొట్టె; | వాఁడు కొట్టె |
| అపుడు | +చనియె | =అపుడుసనియె; | అపుడు చనియె |
| నీవు | +టక్కరివి | =నీవుడక్కరివి; | నీవు టక్కరివి |
| మీరు | +తలఁడు | =మీరు దలఁడు; | మీరు తలఁడు |
| వారు | +పోరు | =వారు వోరు; | వారు పోరు |

పై ఉదాహరణము లన్నిటియందు సూత్రము వికల్పముగా ప్రవర్తించినది. పూర్వపదములు రెండును తెనుగులే. అందువలన అచ్చికమైన ప్రథమమీఁది అచ్చికపరుషములకు గసడదవలు వికల్పముగా నగు ననవచ్చును. పూర్వపదము లన్నియును ప్రథమావిభక్తిప్రత్యయాంతములు కాకపోయినను వాని నట్లే గణింపనగును. రెండవ ఉదాహరణమున కాక, తక్కిన యన్నింటియందును పూర్వపదములు కర్తృపదములు.

ఇచ్చట ఆఖ్యాతము, అనగా క్రియ కర్తను చెప్పినది కావున దానికి ప్రథమ యగును. కారకపరిచ్ఛేదము మొదటి సూత్ర మున "ప్రాతిపదిక సంబోధనోక్తార్థంబులం బ్రథమ యగు"నను టచే వీనిని ప్రథమావిభక్త్యంతములుగనే గణింపనగును.

ఉదాహరణములందు "అపుడు" అనునది మిగిలినది. అపుడుకూడ ప్రథమావిభక్త్యంతము కాదు. దానికి సమా ధానముగా సూరి "అప్పు డిప్పు డెప్పు డను శబ్దములు నిత్యైకవచనాంతములు'' అని వివరించెను. ఇట్లనుటవలన ఆ శబ్దములకు ప్రథమావిభక్త్యంతరూపము కలుగుచున్నది. నన్నయభట్టు కళలనుగూర్చి చెప్పుచు " సుస్ " అను ప్రత్యా హారముచేత ప్రథమావిభక్తిని చెప్పియు "యదా తదా కిమే వాం శ్చ"అని "ఎప్పుడు, అప్పుడు " అను శబ్దములను మరల చెప్పెను. "ఎప్పుడు, అప్పుడు" అనునవి ప్రథకమైకవచనాం తములే ఐనచో, మొదటిలో 'సుస్' అనుదానిచేతనే ప్రథమా విభక్తిని చెప్పియుండుటవలన, మరల ఏల చెప్పవలయును? అని ప్రశ్న వేసికొనెను. దానికి సమాధానముగా 'ప్రపంచా ర్థము' అని చెప్పెను. అనగా మొదట ప్రథమావిభక్తిని చెప్పియు, 'ఎప్పుడు - అప్పుడు' అనువానిని మరల చెప్పుట స్పష్టతకొరకని యర్థము. దానినిబట్టి పై ఉదాహరణములందలి 'అప్పుడు' అనుశబ్దము నిత్యైకవచనాంతమై ప్రథమావిభ క్త్యంతరూపము నొందుచున్నది.

సూత్రమున 'ప్రథమమీఁది పరుషములకు' అని యనుట వలన గ స డ ద వ విధి సమాసపదములకు కాదని తేలుచున్నది. 'సమాసవిభక్తికి లోపం బగు'నని సూరి సమాస పరిచ్ఛేదము ఇరువదైదవ సూత్రమున దెలిపెను. 'ప్రథమ'తో ప్రసక్తియుండుటవలన సమాసమున ఈ సూత్రము ప్రవర్తింపదు

అట్లే పరుషములకు గసడదవలు కళలగు క్రియాపదముల మీఁదకూడ వికల్పముగ వచ్చుచున్నవి. ఇవి అన్యత్వమునకు ఉదాహరణములు :

రారు + కదా = రారు గదా; రారు కదా
వత్తురు + పోదురు = వత్తురు వోదురు; వత్తురు పోదురు.

ఇంక పూర్వపదము తెనుగు, ఉత్తరపదము సంస్కృతము అయిన ఏమగును ?

'తెనుగులమీఁద సాంస్కృతిక పరుషములకు గసడవవలు రావు' అని చిన్నయసూరి గసడదవవిధిని నిత్యముగా నిషేధించెను.

వాఁడు + కంసారి = వాఁడు కంసారి

'వాఁడు' అనునది తెనుగుపదము. 'కంసారి' సంస్కృత సమము. అందువలన తెనుగుప్రథమమీఁద సాంస్కృతిక పరుషమైన "క" కారమునకు "గ" రాలేదు. "క" కారము "క" కారముగనే నిలిచిపోయినది. ఇట్లే

వీఁడు +చక్రపాణి =వీఁడు చక్రపాణి
ఆయది+టంకృతి =ఆయది టంకృతి
అది +తథ్యము =అది తథ్యము
ఇది +పథ్యము =ఇది పథ్యము

మున్నగు వానియందు "స, డ, ద, వ"లు రాలేదు. సూరి యీ విధముగా నిత్యముగా నిషేధించినను, ప్రయోగముల యందు మాత్రము ప్రవృత్తి కనిపించుచున్నది.

"అది మొదలుగాఁగ విష్ణుని
మది నిల్పి యతండు నాకు మగఁ డగునని యి
ట్లు దపంబు సేయుచుండెద" అని తిక్కన నిర్వచ

నోత్తర రామాయణమున తెనుగుమీఁది సంస్కృత తకారమునకు "ద" చేసెను. ఇట్లు+తపంబు=ఇట్లు దపంబు.

అట్లే

ఎవ్వండు+పఠించెడు వాఁడు=ఎవ్వండు వఠించెడువాఁడు
పెంపు +పరీక్షింపవె =పెంపు వరీక్షింపవె
వీరల్ +కోపించిన =వీర ల్గోపించిన

అను ప్రయోగములందు "ప" స్థానమున "వ" యును "క" స్థానమున "గ" యును కన్పించుచున్నవి. అవన్నియును ప్రాసస్థానముననే యున్నవి. అందువలననే ప్రౌఢ వ్యాకరణకర్త "కొన్ని యెడలఁ దెనుఁగులమీఁది సాంస్కృతిక క త పలకు గ ద వ లు గానంబడియెడి" అని సూత్రించి, "కొన్ని యెడల ననఁగా ప్రాసంబులం దని యర్థము" అని వివరించెను.

ఇంతవరకు వ్యస్త పదముల యందలి గ స డ ద వ విధిని తెల్పి సూరి సమాసమునందలి విధిని యిప్పుడు తెల్పుచుండెను. "ద్వంద్వంబునం బదంబు పయి పరుషములకు గ స డ ద వ లగు."

ఉభయపద ప్రాధాన్యము గల సమాసము ద్వంద్వము. మనకు ఆచ్ఛిక ద్వంద్వమే ప్రస్తుత విషయము. అనగా పై సూత్రమునకు ప్రవృత్తి ఆచ్ఛిక ద్వంద్వములందు మాత్రమే. ఇట్లనుటవలన

"మాతాపితలు" మున్నగుచోట "వాదేశము" లేదు. కూర+కాయ=కూరగాయలు.

పైది ఆచ్ఛికద్వంద్వము. "కూర" మొదటి పదము. "కాయ" రెండవ పదము. పదముమీాద వచ్చిన 'కాయ'లోని మొదటి అక్షరమైన 'క' కారమునకు 'గ' కారము వచ్చినది. ఇట్లే

కాలు + చేయి = కాలుసేతులు
టక్కు + టెక్కు = టక్కు డెక్కులు
తల్లి + తండ్రి = తల్లిదండ్రులు
ఊరు + పల్లె = ఊరువల్లెలు

మున్నగునవి యగును. సూరి మతమునుబట్టి ఇది నిత్యము. కాని దీనికి భిన్నముగా కొన్ని ప్రయోగములు కన్పించుచున్నవి. అంద చందములు, అప్పాచెల్లెండ్రు, కండ తుండెములు, రాకపోకలు.

అందము + చందము = అందచందములు

సూరిప్రకారము "చ" కారమునకు "స" రావలసియున్నను ప్రయోగమున అట్లు రాలేదు. తక్కినవికూడ అట్టివే. అందువలననే ప్రౌఢవ్యాకరణకర్త "కొన్నియెడల ద్వంద్వంబునం బదంబుమీఁది చ త ప లకు స ద వ లు గానంబడవు" అని సూత్రించెను.

సూరి గ స డ ద వ విధిని బహుళము చేసెను. ఇందు ప్రవృత్తికి, అప్రవృత్తికి, విభాషకు, అన్యత్వమునకు ఉదాహరణములు గలవు.

## ద్రుతకార్యములు [16-27]

"ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళములగు" ద్రుతమునకు ప్రకృతి యైనది ద్రుతప్రకృతికము. దానిమీఁద వచ్చు పరుషములు నిత్యముగా సరళము లగు నని యర్థము. పరుషములు క చ ట త ప లు- సరళములు గ జ డ ద బ లు. "దంత్యతాలవ్యంబు లయిన చ జ లు సవర్ణంబులు" అని సంజ్ఞాపరిచ్ఛేదమున ఏడవసూత్రమున సూరి తెలిపెను. దానిని బట్టి పరుషములందు దంత్య చ కారమును, సరళములందు దంత్య జ కారమును కూడ గ్రహింపవలయును.

పూచెను + కలువలు = పూచెను గలువలు
తోఁచెను + చుక్కలు = తోఁచెను జుక్కలు
చేసెను + టక్కులు = చేసెను డక్కులు

నెగడెను + తమములు = నెగడెను దమములు

మొగిడెను + పద్మము = మొగిడెను బద్మము

పై ఉదాహరణములందు ద్రుతముమీదనున్న "కచటతప" లకు "గజడదబ"లు వినవి. ఇట్లు పరుషముల స్థానములో వచ్చిన సరళములను ఆదేశసరళములు అని అందురు.

"ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాష వగు."

సంశ్లేష మనగా మీది హల్లుతో కూడుకొనుట. బిందు వనగా అర్థానుస్వారము కాని, పూర్ణానుస్వారము కాని. ద్రుతముమీది పరుషములు సరళములు కాగా, అట్లేర్పడిన సరళములకు ముందున్న ద్రుతమునకు అరసున్న కాని, నిండు సున్న కాని, మీదిహల్లుతో కలయిక కాని యగు నని యర్థము.

పూచెను గలువలు - పూచెం గలువలు (నిండుసున్న)

పూచెను గలువలు - పూచెఁ గలువలు (అరసున్న)

పూచెను గలువలు - పూచెన్గలువలు (సంశ్లేష)

ఇట్లే ఉదాహరణములు ఊహించుకొనుము. ఈ మూడు రూపములు మాత్రమే కాక మరొకరూపము కూడ కలదు. దానిని సూరి "పక్షంబున స్వత్వం బగు" నని వివరణమందు తెలిపెను. స్వత్వం బనగా ద్రుతమునకు ప్రకృతి భావము. సూరి యుద్దేశమున ఉత్వవిశిష్టమైన 'ను' మాత్రమే ద్రుతము.

అందువలన ప్రకృతిభావము రాగా ద్రుతస్థానమున "ను" అనియే నిలుచును- పూచెను గలువలు.

ద్రుతమునకు పరుషములు పరమందున్నపుడు వచ్చు కార్యములను పైని చెప్పి, సూరి సరళస్థిరంబుల విషయము ఇట్లు చెప్పుచుండెను.

"ద్రుతమునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు లోప సంశ్లేషంబులు విభాష నగు."

సరళాక్షరములు గాని, స్థిరాక్షరములు గాని పరమందున్నపుడు ద్రుతమునకు లోపము కాని, సంశ్లేషము కాని విభాష నగు. "పక్షంబున స్వత్వం బగు" అని పూర్వసూత్రమున తెల్పిన అంశమును ఇక్కడ అన్వయించుకోవలయును. అపుడు లోపము వలన ఒకరూపము, సంశ్లేషమువలన ఒకరూపము, స్వత్వము వలన ఒకరూపము- మూడురూపములు సిద్ధించును.

వచ్చెను+గోవులు = { వచ్చె గోవులు (లోపము)<br>వచ్చెన్గోవులు (సంశ్లేష)<br>వచ్చెను గోవులు (స్వత్వము)

మెఱసెను+ఖడ్గము= { మెఱసె ఖడ్గము (లోపము)<br>మెఱసెన్ఖడ్గము (సంశ్లేష)<br>మెఱసెను ఖడ్గము (స్వత్వము)

ప్రకీర్ణకపరిచ్ఛేదము మొదటిసూత్రమున "పదాద్యంబులు ఋ ౡ వర్ణంబులు ర ల తుల్యంబులు" అని సూరి నిర్ణ

యించెను. అందువలన ఋ ౠ వర్ణంబులు ర ల తుల్యములై స్థిరసామ్యమును బొందుచున్నవి. కావుననే అతడు+ఋషి— అన్నపుడు "ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు" నను నిత్యసూత్ర మున్నప్పటికిని సంధి రాలేదు. ఆ+ఋషి— అన్నప్పుడు "సంధి లేనిచో యడాగమము" కావలసియున్నను యడాగమము లేదు. ద్రుతముమీాద "ఋ ౠ" లు వచ్చినట్లయిన వానిని "ర ల"లవలె గ్రహించి వానికగు కార్యములు వీనికిని చేయవలయును.

వచ్చెను+ఋషి = { వచ్చె ఋషి (లోపము) / వచ్చెన్ ఋషి (సంశ్లేష) / వచ్చెను ఋషి (స్వత్వము) }

పై వివేచనవలన సరళములు, స్థిరములు పరము లగునపుడు బిందువు రాదని స్పష్టముగా తేలినది. కాని ప్రయోగములందు కొన్ని చోట్ల సరళములు, వర్గయుక్కులు పరమైనపుడుకూడ పూర్ణబిందువు కనబడుచున్నది. వర్గయుక్కులనగా వర్గాక్షరము లందు రెండు నాలు గక్షరములు. అవి ఇవి - ఖ, ఘ, ఛ, ఝ, ఠ, ఢ, థ, ధ, ఫ, భ. అందువలన చిన్నయసూరి "వర్గయుక్స రళములు పరము లగునపు డొకానొకచో ద్రుతమునకుఁ బూర్ణ బిందువును గానంబడియెడి" అని సూత్రించెను.

వచ్చెను + ధాత్రీపతి = వచ్చెం ధాత్రీపతి
పాడెను + గంధర్వుఁడు = పాడెం గంధర్వుఁడు
కన్ + దోయి = కందోయి

చివరి యుదాహరణమున నున్న "న" కారమును ద్రుత మనుటకు వీలుకాదు. కాని సూరి "న కారంబు ద్రుతంబు" అని సంజ్ఞ పదునొకండవ సూత్రమునందు చెప్పుటవలన ఆయన మతమున ద్రుత మననేమో స్పష్టముకాదు. ఉదాహరణములనుబట్టియే గ్రహింపవలయును. ఉత్వవిశిష్టమయిన నకారము ద్రుతముగా ఆయన ఉద్దేశ్యమని అంతకుముందు అనుకొంటిమి. ప్రస్తుతమునకు వర్తము. ఇక్కడ పూర్వశబ్దము కన్ను.

ప్రకీర్ణకపరిచ్ఛేదమున ఏడవసూత్రమున "అ కారంబు క్రింది అ కారంబునకుం దుది ను లు ల క్రింది న ల లకు లోపంబు బహుళంబుగ నగు" అనుటవలన "కన్ను" "కను" అయినది. అదే పరిచ్ఛేదమున పదునారవసూత్రమున "పదాంతంబు లయి యసంయుక్తంబులయిన ను లు దు ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు" అనుటవలన "కను"- "కన్" అయినది. దీనిని ద్రుతాంతముగా గ్రహించుట కేవలము ప్రక్రియాసౌలభ్యముకొరకే యనుట యుచితము.

"అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపము బహుళముగా నగు." అవసానము అనగా వాక్యము చివర.

"ను" అను ద్రుతముపైనున్న ఉత్వము ద్రుతస్వరము.
వాఁడు వచ్చెను – వాఁడు వచ్చెన్ (ద్రుతస్వరలోపము)
వాఁడు వచ్చె – (ద్రుతలోపము)

ఈ లోపము పద్యాంతములయందు ఆ పద్యమునందలి గణము లనుబట్టి యుండును. చివర గురు వున్నగణము లయిన ద్రుత స్వరమునకు లోపము రావచ్చును; ప్రకృతిభావము వచ్చిన ఛందస్సు తప్పును గాన అచ్చటి ద్రుతమునకు స్వత్వము రాదు.

"కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి"

అదియునున్గాక - అది + ఉను + ను + గాక.

"అది" అను శబ్దముపై "ఉను" అను సముచ్చయార్థకము చేరినది. "ఉను" ద్రుతప్రకృతికము. "అదియును" అయినది.

"అదియును" అనుదానిపై మరల ద్రుతము వచ్చి అదియును + ను + గాక = అదియునుంగాక - అయినది. దివంబును + ను + బోలె = దివంబునుంబోలె.

సూత్రమున "కానంబడియెడి" అని చెప్పుటచేత ప్రయోగము లున్నవని యంగీకరించుట మాత్రమే కాని యిట్లు ద్రుతముపై ద్రుతము నుంచవలయునని సూరి విధించుటలేదు. అర్థవిశేషబోధయందు ఈ "న" కారము వచ్చుచున్నది క్రియారూపములమీఁదకూడ ఇట్టి "న" కారము భారతాదులయందు కన్పించుచున్నది. "అరు దా దేవునియందుఁ గంటి నొకకృత్యం బెవ్వరుం జేయరున్;" "అంతరుఁజాలరుంజుమీ"- వీనికికూడ సూరి అవకాశమును గల్పింపలేదు.

"అఁట యిఁక చూఁడు శబ్దంబులం దప్ప నుడి తొలి హ్రస్వంబుమీఁద ఖండబిందువును ద్రుతంబునకు లోపంబును లేవు."

అఁట, ఇఁక, చూఁడు - అను శబ్దములందు దక్క- పదాదినిగల హ్రస్వముమీద ఖండబిందువు గాని, ద్రుతమునకు లోపముగాని కలుగవు. శబ్దము లని చెప్పుటచేత "ఎఁడు" అను ప్రత్యయమునందు తొలిహ్రస్వముపై ఖండబిందు వుండుటకు ఆక్షేపణ లేదు.

ముందు + కొంగు

ఈ పరిచ్ఛేదమున ముప్పదియారవసూత్రమున "సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు" అనుటచే — ము + కొంగు అయినది. తరువాతిసూత్రమున "లుప్తశేషంబునకుం బరుషములు పరము లగునపుడు నుగాగమం బగు" అనుటచే ము + ను + కొంగు — ము + ను + గొంగు అయినది. "ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందుసంశ్లేషలు విభాషనగు" ననుటచే-ముంగొంగు, ముఁగొంగు, మున్గొంగు- అని మూడురూపములు సిద్ధించుచున్నవి. ఈ సూత్రమున 'నుడి తొలిహ్రస్వము మీద ఖండబిందువు లే' దనుటవలన "ముఁగొంగు" అను అనిష్టరూపము పరిహరింపబడుచున్నది. అట్లే క్రొంబసిఁడి అనునదికూడ. కన్ + దోయి - సంధిపరి

చ్ఛేదము పందొమ్మిదవసూత్రమున "వర్గయుక్సరళములుపరము లగునపు డొకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువునుగానం బడియెడి" అనుటచేతనే 'కందోయి' సిద్ధించినది. కాని దానికి పూర్వమందుండు సూత్రము "ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంగు లగునపుడు లోపసంశ్లేషంబులు విభాష నగు" అనుటచే "కన్దోయి" అనురూపము "కదోయి" అను రూపము కలుగుచున్నవి. ఈ సూత్రమున "నుడి తొలిహ్రస్వముమీఁద ద్రుతమునకు లోపము లే" దనుటవలన "కదోయి" అను అనిష్టరూపము పరిహరింపబడినది.

అట్లే ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందుసంశ్లేషములు, సరళస్థిరంబులు పరంబు లగునపుడు ద్రుతమునకు లోపసంశ్లేషములు విభాష నగునని చెప్పియు "తాను నేను పదంబుల ద్రుతమునకు సంశ్లేషంబు లేదు" అని నిషేధించెను. తాను + చదివె-తాఁ జదివె; తా న్జదివె అని కావలసియుండగా ఈ నిషేధమువలన "తా న్జదివె" యను అనిష్టరూపము పరిహరింపబడుచున్నది. ద్రుతమునకు స్వత్వము రాగా "తాను జదివె" అయినది. దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేనందువలన "తాం జదివె" అనునట్టి రూపము రాదు.

తాను + విని = తావిని; తాను విని

తాను + చదివె = తాఁ జదివె; తాను జదివె

## సమాసద్రుతము

"సమాసంబునందు ద్రుతంబునకు లోపం బగు".
ఎల్ల శబ్దము ద్రుతాంతమయిన అవ్యయము. సమాసమున ద్రుతమునకు లోపము రాగా ఎల్లన్+అర్థములు=ఎల్ల యర్థములు; ఎల్లన్+కలుషములు=ఎల్ల కలుషములు అనియగును. వ్యస్తముగా విశేష్యములకు ముందు దీనికి ప్రయోగము లేదు. అందువలన అర్థము లెల్లన్, కలుషము లెల్లన్-అనునట్లు విశేష్యములకు తరువాతనే దీనికి ప్రయోగము. దీనికి భిన్నముగా "ఎల్లన్ శిష్యులు" అని శ్రీనాథుడు ప్రయోగించెను. అది విశేషము.

'సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబు లగునపుడు నుగాగమంబగు'.

ప్రథమా విభక్త్యేకవచనము లోపించి, ఉకారము అంతమందు గల శబ్దములకు, కర్మధారయమున మువర్ణకమునకు విధించిన పుంపులకు పరుష సరళములు పరము లైనప్పుడు 'ను' ఆగమముగా నగును. ఆగమ మనుటవలన అదనముగా వచ్చి చేరును.

చిగురు + కయిదువు = { చిగురుం గయిదువు, చిగురుఁ గయిదువు, చిగురు న్గయిదువు }

ఉదంత స్త్రీ సమశబ్దము చిగురు. దీనికి పరుషములు పరము లైనపుడు నుగాగమమై అరసున్న, నిండుసున్న, సంశ్లేషలవలన

మూాడు రూపము లగును. 'తళుకు' అను ఉదంత స్త్రీ సమ శబ్దమునకు సరళము పరమైనప్పుడు లోప సంశ్లేష పూర్ణబిందు వులవలన మూాడు రూపము లేర్పడును.

తళుకు + గజ్జెలు = { తళుకు గజ్జెలు / తళుకు న్గజ్జెలు / తళుకుం గజ్జెలు }

అశ్లే పుంపులకు పరుషములు పరములైనపుడు మూాడు రూప ములు, సరళములు పరములైనపుడు మూాడు రూపములు సిద్ధిం చును. "సమాసంబునయందు ద్రుతంబునకు లోపం బగు" అనుటచే ఇక్కడ లోపము రాదా? అన్నచో విధాన సామర్థ్యమున లోపము రాదని సమాధానము. ఇక్కడ నుగాగమ మగు నని విధించుటచేత ఈ ద్రుతమునకు లోపము రాదు. వక్ష్యమాణ విధిచే, అనగా ముందు చెప్పబోవు విధి చేత ద్రుతమునకు స్వత్వము లేదు. తరువాత "సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబు లేదు" అని ద్రుతమునకు ప్రకృతి భావమును నిషేధించెను.

"నలుఁగడ" మున్నగుచోట్ల ఈ యాగమము లేదని కొంద రందురు. నాలుగునకు సమాసమందు 'నలు' కాగా పరశబ్దమైన "కడలు" లోని "క" పరమం దుండగా నుగాగ మము రాదని కొంద రందురు. వచ్చినచో నలుఁగడ, నలుం గడ-నలున్గడ-అను రూపములు వచ్చును.

పై సూత్రమున పరుషసరళములు పరములగునపుడే నుగాగమమును విధించెను. కాని గరువపు+మురువు=గరువపు న్మురువు అని స్థిరవర్ణము పరమైనపుడుకూడ నుగాగమము ఒకానొకచోట కన్పించుచున్న దని సూరి వివరించెను.

తలఁబ్రాలు మొదలగు సమాసంబుల ద్రుతమునకు లోపము లేదు. సమాసమునందు ద్రుతమునకు లోప మగు నని విధి యుండగా ఇక్కడ కాదని భావము. అందువలననే తలఁబ్రాలు, ఒడిఁబ్రాలు, సేసఁబ్రాలు, ఊరఁబంది, ఊరఁబిచ్చిక, తోడఁబుట్టువు, తోఁబుట్టువు, ఒల్లఁబాటు, ఒడఁబాటు- మున్నగునవి ఉదాహరణములు.

## టు గా గ మ ము [28-29]

"కర్మధారయంబులం దుత్తున కచ్చు పరం బగునపుడు టుగాగమం బగు." ఇది నిత్యవిధి.

ఉత్తరపదప్రాధాన్యముగల సమాసము తత్పురుషము. ఇది వ్యధికరణము, సమానాధికరణము అని రెండువిధములు. ద్వితీయాదులకు మీఁది పదముతోడ సమాసము వ్యధికరణము. దీనినే తత్పురుష మనియు అందురు. విశేషంబునకు విశేష్యంబుతోడ సమాసంబు సమానాధికరణము. విశేషణవిశేష్యములేకవిభక్తికము లయిన సమానాధికరణము అని యర్థము. దీనినే కర్మధారయము అనియు అందురు.

పై సూత్రమున "కర్మధారయంబులందు" అని బహు వచన ముపయోగించుటవలన తత్పురుషము, కర్మధారయము-రెండును గ్రాహ్యము లగుచున్నవి.

కఱకు + అమ్మ = కఱకుటమ్మ

నిగ్గు + అద్దము = నిగ్గుటద్దము

పై రెండు ఉదాహరణములందును పూర్వపదములు రెండును ప్రథమావిభక్త్యంతములు; ఉదంతములు. అందువలన ఉత్తున కచ్చు పరమైనపుడు టుగాగమమై కఱకు+టు+అమ్మ = కఱకుటమ్మ అను రూపము సిద్ధించినది.

సరసము + అలుక — కర్మధారయములందు మువర్ణకమునకు పుం, పులగు ననుసూత్రముచే- సరసపు+అలుక-కాగా ప్రస్తుతసూత్రమున టుగాగమమై సరసపుటలుక అయినది.

తత్పురుషములకు వేల్పుటావు, సముద్రపుటొడ్డు మున్నగునవి ఉదాహరణములు.

సూత్రమున "ఉత్తున కచ్చు పరం బగునపుడు టుగాగమం బగు" ననుటచే ఉదంతపదము లయిన విశేషణములే స్వీకరించిన ట్లయినది. కాని ప్రయోగములందు తద్భిన్నములకుసైతము టుగాగమము కన్పించుచున్నది-పల్లెటూరు, తేనెటీఁగ,దుక్కిటెద్దు మున్నగునవి ఉదాహరణములు.

"కర్మధారయంబునందుఁ బేర్వాదిశబ్దముల కచ్చు పరం బగునపుడు టుగాగమంబు విభాష నగు."

కర్మధారయంబునందు అని ఏకవచనముననే చెప్పుట చేత ఇక్కడ తత్పురుషసమాసము గ్రాహ్యము కాదు. కర్మధారయసమాసమునందు పేరు మొదలయిన శబ్దములకు అచ్చు పర మగునపుడు టుగాగమము విభాష నగును.

పేరు + ఉరము – పేరు+టు+ఉరము = పేరుటురము; పేరురము

చిగురు+ఆకు–చిగురు + టు + ఆకు = చిగురుటాకు; చిగురాకు

పొదరు+ఇల్లు–పొదరు + టు + ఇల్లు = పొదరుటిల్లు; పొదరిల్లు

## రుగాగమము [30-31]

"పేదాదిశబ్దంబుల కాలుశబ్దము పరం బగునపుడు కర్మధారయమునందు రుగాగమం బగు."

పేద, బీద, ముద్ద, బాలెంత, కొమ, జవ, అయిదువ, మనుమ, గొడ్డు—మున్నగునవి పేదాదులు.

కర్మధారయ సమాసమునందు పేద మున్నగు పదములకు ఆలు శబ్దము పరమైనపుడు నిత్యముగా రుగాగమ మగును. పేదాదు లనుటవలన పూర్వశబ్దము లాచ్ఛికములే కావలయు నని విధి కలదు. "జవ్వని" అను శబ్దమునకు ఆదేశరూపము "జవ". ఈ సమాసమునందు "ఆలు" అను పదమునకు "స్త్రీ" యని మాత్రమే యర్థము.

పేద + ఆలు — పేద + రు + ఆలు = పేదరాలు
బీద + ఆలు — బీద + రు + ఆలు = బీదరాలు

సమాసమునందు పూర్వపదములుగా తత్సమము లున్నచో, పై సూత్రమునకు ప్రవృత్తి లేనందువలన సూరి వానికొఱకు మఱొక సూత్రమును చెప్పుచుండెను.

"కర్మధారయంబునం దత్సమంబుల కాలుశబ్దము పరంబగునపు డత్వంబున కుత్వంబును రుగాగమంబు నగు."

కర్మధారయ సమాసమందు అదంతము లయిన తత్సమ శబ్దములకు ఆలు శబ్దము పర మగునప్పుడు అత్తునకు ఉత్వము వచ్చును; తరువాత రుగాగమము అగును.

ధీర + ఆలు — ధీరు + ఆలు —
ధీరు + రు + ఆలు = ధీరురాలు
గుణవంత + ఆలు — గుణవంతు + ఆలు —
గుణవంతు + రు + ఆలు = గుణవంతురాలు

సంస్కృతమున "ధీరా" అనగా ధైర్యవంతురాలు. అది తెలుగు సంప్రదాయమునుబట్టి, చివరిదీర్ఘమును గోల్పోయి "ధీర" అయినది. అట్లే తత్సమమయిన "ధీర"కు ఆలు శబ్దము పరమైనపుడు పైని చెప్పిన కార్యము లగును.

"గుణవంతమ్" అనునది సంస్కృతమున ద్వితీయా విభక్తి—ఏకవచన ప్రత్యయమును అంతమందు కలిగియున్నది. తత్సమపరిచ్ఛేదము డెబ్బదవసూత్రమున "మతుబాదికంబు

ద్వితీయైకవచనాంతత్త్యంబు నామం బగు'' అనుటచే సంస్కృతమునుండి తెనుగునకు తత్సమముగా వచ్చు శబ్దము ద్వితీయైక వచనరూపమువలె నుండును. అందువలన ప్రాతిపదిక "గుణవంతమ్". ఆ తరువాతిసూత్రమున "దాని యంతిమ మకారమునకు లోపం బగు'' ననుటచేత "గుణవంత" అను రూపము సిద్ధించినది. అప్పుడు ప్రస్తుతసూత్రముచేత ఉత్వము రుగాగమము కలుగగా "గుణవంతురాలు" సిద్ధించును.

## పుంపులు (32)

"కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బు ంపు లగు." "కర్మధారయంబులందు" అను బహువచనముచేత తత్పురుష, కర్మధారయము - రెండును గ్రాహ్యములు. వర్ణకము అనగా ప్రత్యయము.

తత్పురుష కర్మధారయములందు 'ము'ప్రత్యయము నకు పు-ంపు అనునవి ఆదేశముగా నగును. ఇది నిత్యసూత్రము.

సరసము + మాట = సరసపుమాట; సరసంపుమాట

విరసము + వచనము = విరసపువచనము; విరసంపువచనము

## నుగాగమము (33-35)

"ఉదంతమగు తద్ధర్మార్థకవిశేషణమున కచ్చు పరం బగునపుడు నుగాగమం బగు."

"తద్ధర్మార్థకములు" అనగా వచ్చు, పోవు మున్నగు

నవి. ఇవి క్రియావిశేషణము లయినపుడు అచ్చు పరమం దున్నచో వానికి "ను" ఆగమ మగును.

చేయు+అతఁడు—చేయు+ను+అతఁడు=చేయునతఁడు

చేసెడు+అతఁడు—చేసెడు+ను+అతఁడు=చేసెడునతఁడు

"అచ్చు పరమగునపుడు" అని చెప్పుటచేత "హల్లు" పరమైనపుడు "నుగాగమము" లేదు.

"షష్ఠీసమాసమునం దుకార ఋకారంబుల కచ్చు పరం బగునపుడు నుగాగం బగు",

షష్ఠీసమాసము అనగా పూర్వపదము షష్ఠీవిభక్తి ప్రత్యయాంత మయిన తత్పురుషము.

రాజుయొక్క + ఆజ్ఞ
విధాతృయొక్క + ఆనతి

సూత్రమున ఉ కార ఋ కారములకు అచ్చు పర మగునపుడు నుగాగమ మగునని యున్నది. పై ఉదాహరణములందు ఉకార ఋ కారములకు కాక, "యొక్క"కు పరమందున్నది అచ్చు. అందువలన ఉన్నట్లుగా సూత్రము వర్తింపదు. సమాస పరిచ్ఛేదము ఇరువదైదవసూత్రమున "సమాసవిభక్తికి లోపం బగు లట్టునకుఁ గాదు." అనుటవలన సమాసమున విభక్తికి లోపము రాగా

రాజు + ఆజ్ఞ = రాజునాజ్ఞ
విధాతృ + ఆనతి = విధాతృనానతి

అను రూపములు సిద్ధించును.

"ఉదంత స్త్రీసమంబులకును బుంపులకు నదంతగుణ చకంబులకును దనంబు పరం బగునపుడు నుగామం బగు."

ప్రథమైకవచనప్రత్యయము లోపించిన ఉదంతశబ్దములు- ఉదంత స్త్రీసమములు; కర్మధారయములందు మువర్ణకము నకు ఆదేశముగా వచ్చినవి పుంపులు; హ్రస్వమైన అకార మును అంతమందు గలిగి గుణమును బోధించునవి అదంతగుణ వాచకములు-వీనికి తద్ధితప్రత్యయమైన "తనము" పరమం దున్నపుడు "ను" ఆగమ మగును. విభక్తిని అంతమందుగల శబ్దముల మీాద భావార్థము, మతుబర్థము మున్నగువాని యందు ప్రయోగించెడు ప్రత్యయములు తద్ధితములు. ఇచ్చట "తనము" భావార్థమునం దగును.

సొగసు+తనము—సొగసు+ను+తనము (ఉదంత స్త్రీసమము)
సరసపు+తనము—సరసపు+ను+తనము (పుంపులు)
తెల్ల+తనము-తెల్ల+ను+తనము (అదంత గుణవాచకము)

ఇట్లు ఏర్పడిన పిమ్మట ద్రుత కార్యము చేయగా, సంధి పరిచ్ఛేదము పదునేడవ సూత్రమును బట్టి బిందు సంశ్లేషము లతో మూడు రూపములు సిద్ధించును.

సొగసుఁదనము; సొగసుందనము; సొగసున్దనము
సరసపుఁదనము; సరసపుందనము; సరసపున్దనము
తెల్లఁదనము; తెల్లందనము; తెల్లన్దనము

ద్రుతమునకు ప్రకృతి భావము రాదు.

## ప్రాంతాదులు (36-39)

"సమాసమునం బ్రాంతాదుల తొలియచ్చుమీఁది వర్ణ
ములకెల్ల లోపంబు బహుళంబుగా నగు."

ప్రాంత + ఇల్లు = { ప్రాయిల్లు / ప్రాంత యిల్లు }

సమాసమునందు ప్రాంత మున్నగు శబ్దముల తొలి యచ్చు మీఁది యక్షరముల కన్నింటికి లోపము బహుళముగా నగును.

"ప్రాంత" అను శబ్దమునందు తొలియచ్చు "ప్రా" లోని "ఆ". తరువాత నున్న అక్షరములు అర్ధానుస్వార, తవర్ణములు. ఈ సూత్రముచేత మొదటి అచ్చుమీఁదివైన ఆ రెండింటికి లోపము రాగా ప్రా+ఇల్లు అయినది. దీర్ఘము మీఁద సంధి లేనందువలన యడాగమమై 'ప్రాయిల్లు' అయినది.

బహుళము అనుటవలన ఇక్కడ ఈ సూత్రము విభాషను ప్రవర్తించును. సూత్రము ప్రవర్తింపకున్నపుడు ప్రాంత యిల్లు అనియే రూపము.

లేంత+దూడ=లేదూడ; లేంతదూడ.

పూవు+రెమ్మ=పూరెమ్మ; పూవురెమ్మ.

పై మూడు ఉదాహరణములందును పరమందు స్వరము, సరళము, స్థిరమును ఉన్నవానిని జూపెను. పరుషము పరమైనపుడు జరుగు కార్యమును వేరుగా చూపుచుండెను. "లుప్త

శేషంబునకుం బరుషంబులు పరంబు లగునపుడు నుగాగమం బగు."

ప్రాఁత మున్నగుశబ్దములయందు వెనుకటి సూత్రము చేత లోపింపగా మిగిలిన యక్షరమునకు పరుషములు పరము లగునపుడు "ను" నిత్యముగా ఆగమ మగును.

ప్రాఁత+కెంపు

వెనుకటి సూత్రమువలన అర్ధానుస్వార తకారములు లోపింపగా"ప్రా" మిగిలినది. దానికి పరమందు "కెంపు"ఉన్నది. "క" వర్ణము పరుష మగుటవలన ప్రకృతసూత్రమున "ప్రా"కు నుగాగమ మగును.

ప్రా+ను+కెంపు

"ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళము లగు"అను సూత్రముచేత ప్రా+ను+గెంపు అయినది. " ఆదేశసరళములకుముందున్నద్రుతమునకు బిందుసంశ్లేషలు విభాషనగు" అనుటచేత "ను" స్థానమున అర్ధానుస్వార, పూర్ణానుస్వార, సంశ్లేషలు కావలసి యుండును.

ప్రా+ను+గెంపు=ప్రాఁగెంపు.

దీర్ఘముమీఁదిది కాన సాధ్యపూర్ణము లేదు. వ్యవస్థితవిభాష యగుటచేత ఈద్రుతమునకు సంశ్లేషము లేదు. కాబట్టి "ప్రాఁగెంపు" అని ఒకటే రూప మేర్పడును. అట్లే లేఁగొమ్మ, పూఁదోఁట — అనునవి యేర్పడును. ముప్పదియారవసూత్రము

ప్రవర్తింపనిచో - ప్రాఁతకెంపు, లేఁతకొమ్మ, పూవుఁదోఁట అను రూపములే యుండును.

బహుళగ్రహణముచేత "మీఁదు" మున్నగు శబ్దములందు తొలియచ్చుమీఁదివర్ణములకెల్ల లోపము నిత్యము.

మీఁదు+కడ=మీఁగడ

"చెన్ను" శబ్దమునకు సమాసమునందు "ఎఱ్ఱని" అనియర్థము.

చెన్ను + తొవ— చె + తొవ

నుగాగమము రాగా చె+ను+తొవ= చెందొవ అయినది. "అఁట, యిఁక, చుఁడు శబ్దములం దప్ప నుడి తొలిహ్రస్వము మీఁద ఖండబిందువు లేదు." అను సూత్రముచేత అర్ధానుస్వారరూపము రాదు; వ్యవస్థితవిభాషచే సంశ్లేషరూపము రాదు. ఇంక పూర్ణబిందురూప మొక్కటియే వచ్చును. ఇట్లే "కెందామర" యగును.

"క్రొత్త శబ్దంబునకాద్యక్షర శేషంబునకుం గొన్నియెడల నుగాగమంబునుం గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబునగు."

"మీఁదిహల్లునకు" అనుటచేత పరమందు అచ్చు ఉన్నపుడు ఈసూత్రము ప్రవర్తింపదు.

పరుషములు పరము లగునపుడు లుప్త శేషమునకు "ను" ఆగమమగునను పూర్వసూత్రమువలన పరుషములు పరమగునపుడు నుగాగమము, మీఁదిహల్లునకు ద్విత్వము- ఏదేని

వచ్చును. సరళ స్థిరములు పరములగునపుడు మీది హల్లునకు ద్విత్వము మాత్రమే వచ్చును.

క్రొత్త+చాయ - క్రొ+ను+జాయ=క్రొంజాయ
క్రొత్త+చెమట - క్రొ+ను+జెమట=క్రొంజెమట
క్రొత్త+పసిఁడి - క్రొ+ను+బసిఁడి=క్రొంబసిఁడి
క్రొత్త+కారు - క్రొ+క్+కారు =క్రొక్కారు
క్రొత్త+తావి - క్రొ+త్+తావి =క్రొత్తావి
క్రొత్త+గండి - క్రొ+గ్+గండి =క్రొగ్గండి
క్రొత్త+నన - క్రొ+న్+నన =క్రొన్నన
క్రొత్త+మావి - క్రొ+మ్+మావి=క్రొమ్మావి

కెందూళి, కెంజడలు అని ప్రయోగములు కనబడుచున్నవి. ప్రస్తుత సూత్రమున క్రొత్త శబ్దము పూర్వమం దున్నపుడే నుగాగమము, మీది హల్లునకు ద్విత్వమును తెలుపబడినది. పూర్వసూత్రమున పరమందు పరుషము లున్నపుడే నుగాగమము విధింపబడినది. కాని కెంపు+దూళి; కెంపు+జడలు అనువానియందు పూర్వ శబ్దము "క్రొత్త" కాదు. పరమందు పరుషము లేదు. అయినను "నుగాగమము" అయ్యెను. ఇది విశేషము.

బహుళ గ్రహణము చేత "క్రొత్త కుండలు" మున్నగు వానియందు తొలియచ్చుమీది వర్ణములకు లోపము రాదు.

బహుళము అనుట వలన క్రింది శబ్దమున లుప్త శేషమునకు దీర్ఘము అగును.

క్రిందు+కాలు-క్రీ+ను+కాలు=క్రీఁగాలు
క్రిందు+కడుపు-క్రీ+ను+కడుపు=క్రీఁగడుపు
క్రిందు+తొడ-క్రీ+ను+తొడ=క్రీఁదొడ

ఇంతవరకు ఒక పద్ధతిని అనుసరించి యేర్పడిన రూపములను తెల్పెను. కాని పద్ధతికి లొంగని ప్రయోగములను సూరి ఇప్పుడు ఉదాహరించుచుండెను.

"అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి."

ప్రాఁతాదులలో చేరని శబ్దములకుకూడ ఒక శబ్దము పరమగునపుడు లోప నుగాగమములును, ఒక శబ్దము పరమగు నపుడు లోప ద్విత్వములును కనబడునని భావము. ఏదో పదమునకు ఏదో పదము పరమగునపుడు ఇవి వచ్చునని యర్థము కాదు. క్రింది ప్రయోగమును బట్టి ఆ పదములకు ఆ పదములే పరము లైనపుడు ఆ మార్పులు వచ్చునని గ్రహింపవలయును.

| | | | | |
|---|---|---|---|---|
| పది | + | తొమ్మిది | = | పందొమ్మిది |
| తొమ్మిది | + | పది | = | తొంబది |
| వంక | + | చెఱఁగు | = | వంజెఱఁగు |
| సగము | + | కోరు | = | సంగోరు |
| నిండు | + | వెఱ | = | నివ్వెఱ |
| నిండు | + | వెఱఁగు | = | నివ్వెఱఁగు |
| నెఱ | + | తఱి | = | నెత్తఱి |

నెఱి + నడుము = నెన్నడుము

నెఱి + మది = నెమ్మది

నెఱి + వడి = నెవ్వడి

ఇట్టివానిని ప్రయోగములనుబట్టి గ్రహింపవలయును.

## ఆ మ్రే డి త ము (40-42)

"ఆమ్రేడితంబు పరం బగునపుడు కడాదులం దొలి యచ్చుమీఁది వర్ణంబుల కెల్ల నదంతం బగు ద్విరుక్తటకారం బగు." కడ మున్నగు పదములు అత్యంతార్థమున ద్విరుక్తము లైనపుడు పూర్వపదము తొలియచ్చుమీఁది యన్నివర్ణములకు "ట్ట" ఆదేశముగా నగును.

కడ + కడ = కట్టకడ

ఎదురు + ఎదురు = ఎట్టయెదురు

కడ, ఎదురు, కొన, చివర, తుద, తెన్ను, తెరువు, నడుము. పగలు, పిడుగు, బయలు, మొదలు మున్నగునవి కడాదులు. వానికి ఆమ్రేడితము పరమగునపుడు వచ్చు రూపము లివి–

కట్టకడ, ఎట్టఎదురు, కొట్టకొన, చిట్టచివర, తుట్టతుద, తెట్టతెన్ను, తెట్టతెరువు, నట్టనడుము, పట్టపగలు, పిట్టపిడుగు, బట్టబయలు, మొట్టమొదలు.

"ఆమ్రేడితంబు పరం బగునపుడు విభక్తి లోపంబు బహుళంబుగా నగు."

అప్పటికిన్ + అప్పటికిన్ = { అప్పటప్పటికిన్ / అప్పటికప్పటికిన్ }

అక్కడన్ + అక్కడన్ = { అక్కడక్కడన్ / అక్కడనక్కడన్ }

ఇంటన్ + ఇంటన్ = { ఇంటింటన్ / ఇంటనింటన్ }

ఊరన్ + ఊరన్ = { ఊరూరన్ / ఊరనూరన్ }

మొదటి ఉదాహరణమున శబ్దము షష్ఠీప్రత్యయాంతము, తక్కిన ఉదాహరణములయందలి శబ్దములు సప్తమీప్రత్యయాంతములు. సూత్రప్రవృత్తివలన మొదటి రూపమును, అప్రవృత్తివలన రెండవ రూపమును ఏర్పడినవి.

"బహుళము" అని అనుటవలన ఇంచుక, నాఁడు మున్నగువానియందు చివరియక్షరము లోపించును.

ఇంచుక + ఇంచుక = { ఇంచించుక / ఇంచుకించుక }

నాఁడు + నాఁడు = { నానాఁడు / నాఁడునాఁడు }

పైని చెప్పినవి కాక ఆమ్రేడితంబు పరంబగునపుడు కొన్ని శబ్దములు ఇతరవిధములయిన మార్పులు నొందును. వానిని గురించి "అందదుకుప్రభృతులు యథాప్రయోగంబుగ

గ్రాహ్యంబులు"అని తెల్పెను. ప్రయోగములనుబట్టియే వాని రూపములను ఎరుగవలయు నని భావము.

| | | | | |
|---|---|---|---|---|
| అదుకు | + | అదుకు | = | అందదుకు |
| ఇంకులు | + | ఇంకులు | = | ఇట్టింకులు |
| ఇగ్గులు | + | ఇగ్గులు | = | ఇల్లిగ్గులు |
| చెదరు | + | చెదరు | = | చెల్ల చెదరు; చెల్లా చెదరు |
| తుమురు | + | తుమురు | = | తుత్తుమురు |
| తునియలు | + | తునియలు | = | తుత్తునియలు |
| మిట్లు | + | మిట్లు | = | మిఱుట్లు |

## సమాసకార్యములు [43-45]

"చేత తోడ వలన ల కిత్వంబు సమాసంబులం దగు." సమాసములందు చేత, తోడ, వలన అను విభక్తిప్రత్యయము లకు 'ఇ' నిత్యముగా నగును.

"సమాసవిభక్తికి లోపం బగు" అనుటచే లోపము రావలసి యుండగా ఆ విభక్తికే ఇత్వము విధించుటచేత లోపము లేదని స్పష్టము. ఇట్లు విభక్తికి లోపము రాని సమాసములను అలుక్సమాసములు అని అందురు.

| | | | | |
|---|---|---|---|---|
| నీచేతన్ | + | ప్రోపు | = | నీచేతి ప్రోపు |
| నాతోడన్ | + | చెలిమి | = | నాతోడి చెలిమి |
| నీవలనన్ | + | భయము | = | నీవలని భయము |

"అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునం దగు". అందు సప్తమీవిభక్తి ప్రత్యయము; ఇందు, ఎందు- ప్రత్యయ ప్రతిరూపకము లగు శబ్దములు; ఆదిశబ్దముచేత ఇందు, ఎందు అనునవి గ్రాహ్యములు.

సమాసమునందు అందు, ఇందు, ఎందు అనువానికి "అలి" అను ఆగమ మగును.

నాయందున్ + కరుణ = నాయందలి కరుణ
ఇందున్ + జనులు = ఇందలి జనులు
ఎందున్ + వారు = ఎందలివారు

కొందఱి యభిప్రాయమున "ఎందు" అను శబ్దమునకు "అలి" అను ఆగమము లేదు. అప్పుడు "ఎందువారు" అని యగును.

"అది అవి శబ్దంబుల యత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగ నగు."

సమాసమందు "అది, అవి" అను శబ్దముల ముందున్న అత్త్వమునకు లోపము బహుళముగా నగును.

నా + అది = నాది; నాయది
నా + అవి = నావి; నాయవి

పై చోట్ల విభాషగా సూత్రము ప్రవర్తించినది. బహుళము అనుటచేత ఉదంతము లగు తద్ధర్మ విశేషణంబులకు మీాద లోపము లేదు.

వచ్చు + అది = వచ్చునది
వచ్చు + అవి = వచ్చునవి

"ఉదంత మగు తద్ధర్మార్థవిశేషణమున కచ్చు పర మగు నపుడు నుగాగమం బగు" అను సంధిపరిచ్ఛేదము ముప్పది మూడవ సూత్రముచేత పై రూపములు సిద్ధించును.

బహుళము అనుటచేత ఇదంతము లగు తద్ధర్మవిశేషణ ములమీాద అత్తునకు లోపము నిత్యముగా నగును.

వచ్చెడి + అది = వచ్చెడిది
వచ్చెడి + అవి = వచ్చెడివి

## ము వ ర్ణ క ము [46-47]

"పడ్వాదులు పరంబు లగునపుడు మువర్ణకంబునకు లోప పూర్ణబిందువులు విభాష నగు".

ప్రథమావిభక్తి యేకవచనప్రత్యయమైన "ము" నకు పడు మున్నగునవి పరమగునపుడు లోపముకాని,పూర్ణబిందువు గాని విభాషగా నగును.

భయము + పడియె = { భయపడియె / భయంపడియె }

సూత్రము + పట్టె = { సూత్రపట్టె / సూత్రంపట్టె }

విభాష అనుటవలన సహజములయిన ముకర్ణకముతోడి రూప ములుకూడ సిద్ధించును. భయముపడియె; సూత్రముపట్టె.

కర్తను బోధించు శబ్దమునకు అంతమందున్న "ము" వర్ణకమునకు ఈ కార్యము రాదు.

గజము + పడియె

"పడియె" అనునది క్రియ. ఇది గజమును చెప్పుచున్నది. గజము కర్త. అందువలన "గజము" కొననున్న "ము" అను ప్రత్యయమునకు లోపము కాని, పూర్ణబిందువు కాని లేవు.

మ ధ్య మ ము వ ర్ణ క ము [48-49]

"మధ్యమపురుష మువర్ణకంబునకు హలవసానంబులు పరంబు లగునపుడు లోపము విభాష నగు."

ప్రథమపురుషకు డు రు; మధ్యమపురుషకు వు రు; ఉత్తమపురుషకు ను ము—అను ప్రత్యయములు ఏకవచన బహువచనములందు క్రమముగా అగును.

ఆంగ్లములో కర్తృపదములను "పురుషలు" అను పేర వ్యవహరింతురు. కాని యిక్కడ క్రియాపదములను పురుష లని వ్యవహరింతురు.

యుష్మదర్థమునందు మధ్యమపురుష ప్రత్యయము లగును. నీవు-వు; మీరు-రు.

"లూణ్మధ్యమ పురు లకు ముడుజ్జు లగు" అను క్రియా పరిచ్ఛేదము ఇరువదితొమ్మిదవ సూత్రముచేత ఆశీశ్శాపసంప్రార్థనవిధులందు మధ్యమపురుష వు, రు అను ప్రత్యయములకు వరుసగా "ము, డు" అను ప్రత్యయము లగును. ఇందువలన-

ఆశీస్సు మున్నగువానియందు మధ్యమపురుష, యేకవచనమున నగు "ము" ప్రత్యయమునకు హల్లుకాని, అవసానము కాని పరమైనప్పుడు లోపము విభాషగా నగును- అని ప్రకృత సూత్రమునకు అర్థము.

చూడుము + నన్ను { చూడు నన్ను / చూడుము నన్ను

ఇటు + చూడుము { ఇటు చూడు / ఇటు చూడుము

మొదటి ఉదాహరణమున హల్లు పరమైనది. రెండవ ఉదాహరణమున అవసానము పరమైనది. అనగా వాక్యము ముగిసి పోయినది. రెండింటియందును "ము" లోపించుటవలన ఒక రూపమును, లోపింపకుండుటవలన ఒక రూపమును, గలిసి రెండేసి రూపములు సిద్ధించినవి.

చూడుము + అనియె = చూడుమనియె
వినుము + అనియె = వినుమనియె

పై ఉదాహరణములందు అచ్చు పరమగుచుండుటచేత మువర్ణకమునకు లోపములేదు. ఉత్వసంధి వచ్చి పై రూపము లేర్పడినవి,

"వ్యతిరేకమధ్యమమువర్ణకంబున కెల్లయెడల లోపంబు విభాష నగు."

వ్యతిరేకమున వచ్చు మధ్యమపురుష మువర్ణకంబునకు అచ్చు కాని, హల్లుకాని, అవసానము కాని పరమైనపుడు, అన్నియెడల లోపము విభాష నగును.

నమ్మరుము + ఇట— నమ్మరు + ఇట = నమ్మరిట.

"ఆమ్రేడితంబు పరం బగునపుడు మధ్యమ ముడుఙ్ఞులకు లోపంబు విభాష నగు."

మధ్యమపురుష, యేకవచన బహువచన ప్రత్యయము లయిన ము, డు లకు ఆమ్రేడితము పరమగునపుడు లోపము విభాషగా నగునని భావము. ఇట్లు చెప్పుటచేత ఆమ్రేడితము పర మగునపుడు ఇతర క్రియావిభక్తులకు లోపము లేదని స్పష్టము.

ఉండుము + ఉండుము—ఉండు + ఉండుము = ఉండుండుము; ఉండుముండుము.

కొట్టుఁడు + కొట్టుఁడు — కొట్టు + కొట్టుఁడు = కొట్టు కొట్టుఁడు; కొట్టుఁడు కొట్టుఁడు

లోపము వచ్చి ఒక రూపమును, లోపము రాక ఒక రూప మును సిద్ధించినవి.

## అనుకరణము [50_54]

"అను" అను ధాతువును చేర్చి చెప్పుట అనుకరణము. "విసర్గంబున కనుకరణంబున లోపం బగు". అను ధాతువును చేర్చి చెప్పినపుడు విసర్గమునకు లోపము అగును.

వర్ధతాం శ్రీః + అనియె = వర్ధతాం శ్రీ + అనియె సంధి లేనిచో యడాగమ మగునుగాన వర్ధతాం శ్రీ యనియె.

"అనుకృతిని నమశ్శబ్దము తుదియత్తున కోత్వము విభాష నగు."

తుభ్యం నమః + అనె

పూర్వసూత్రముచేత విసర్గమునకు లోపము కలుగగా-

తుభ్యం నమ +అనె — అని అయినది.

ప్రస్తుతసూత్రమున తుది అత్వమునకు ఓత్వము రాగా

తుభ్యం నమో + అనె

దీర్ఘముమీద సంధి లేనందువలన యడాగమమై-

తుభ్యం నమో యనె - అని సిద్ధించినది.

సూత్రమున నమశ్శబ్దము తుది యత్వమునకే ఓత్వము విధింపబడినది. కాని "గతాను గతికో లోకో యటంచున్" అని ఒక ప్రయోగము గలదు.

లోకః + అటంచున్

ఇక్కడ పూర్వసూత్రమువలన విసర్గ లోపించి "లోక యటంచున్" కావలసియుండగా "లోకో యటంచున్" అని కవి ప్రయోగించెను. అందువలననే సూరి వివరణమున "ఈ కార్యము లాంఛనసహితము గనంబడియెడి" అని స్పృశించెను.

"అనుకరణంబునం దుదిహల్లునకు ద్విర్వచనం బగు"

కిం తత్ + అనియె = కిం తత్తనియె

కస్త్వమ్ + అనియె = కస్త్వమ్మనియె

పై ఉదాహరణములందు అనుకరణమున తుది హల్లునకు ద్విత్వము నిత్యముగా నగును. కాని "అహమ్" మున్నగువాని మకారంబునకు అనుకరణమునందు ద్విర్వచనము విభాషగా నగును. అందువలన ద్విత్వము వచ్చి ఒక రూపము, ద్విత్వము రాక ఒకరూపము నేర్పడును.

దాసోహమ్ + అనె = { దాసోహమ్మనె / దాసోహమనె

తత్కర్తవ్యమ్+అనె = { తత్కర్తవ్యమ్మనె / తత్కర్తవ్యమనె

"ఉదంతనామంబున కనుకరణంబునందు వుగాగమం బగు". హ్రస్వమైన ఉకారమును అంతమందుగల నామవాచకమునకు అనుకరణమునందు "వు" అను ఆగమము నిత్యముగా నగును అని యర్థము.

ఇయం ధేనుః + అనె

అనుకరణమున విసర్గకు లోపము రాగా—

ఇయం ధేను +అనె

ప్రకృతిసూత్రముచేత-

ఇయం ధేను + వు + అనె = ఇయంధేనువనె అను రూపము సిద్ధించినది.

అనుకరణమున దీర్ఘమునకు హ్రస్వ మగునని ఒకడు చెప్పెను. "దుర్బలస్య బలం రాజా యన వినవే" అనుట వలన పై మాట నిరాధార మగుచున్నది.

## వాక్యావసానము [55]

వాక్యము సమాప్తమైనపుడు సంధి చేయకుండుట దోషము కాదని పెద్దలందురు. దీనివలన వాక్యమధ్యమందు సంధి చేయకుండుట దోషముగా పెద్దలు పరిగణింతురని నిర్ధారణ చేయుట యైనది.

సత్యము సర్వశ్రేయము—అది లేనిచో సర్వధర్మములు వ్యర్థములు.

పద్యగ్రంథములందు ఇట్లు సంధి లేకుండ నుండుట పాదాంతములందు కన్పడును.

"పడగ నున్న హనుమ భయవిహ్వలుఁడు గాఁడు
అరదమునకు సూతుఁడచ్యుతుండు"

# ఛందోఽలంకారములు

## ఛ ం ద స్సు

పద్యరచనను గుఱించి తెలుపు శాస్త్రము ఛందస్సు. పద్యములు గణములచే ఏర్పడును. గణములు గురు లఘువులచే ఏర్పడును. ఒకమాత్ర కాలమున ఉచ్చరింపదగినవి లఘువులు; రెండుమాత్రల కాలమున ఉచ్చరింపదగినవి గురువులు.

గురువులు :—దీర్ఘాక్షరములు — ఆ, కా, కీ, ఏ
పూర్ణబిందువులతో కూడినవి— కం, రం
విసర్గముతో కూడినవి— అః, గః
సంయుక్తాక్షరములకు ముందున్నవి— చక్రి, శక్తి
ద్విత్వాక్షరములకు ముందున్నవి - చెట్టు, పత్తి
పొల్లక్షరములతో కూడినవి—మున్; కిన్, నిన్

లఘువులు : గురువులు కాని వన్నియు లఘువులు.
గురువునకు చిహ్నము ు
లఘువునకు చిహ్నము ।

మూడక్షరములతో ఏర్పడు గణములను "నిసర్గగణములు" అని అందురు.

మగణము ు ు ు శ్రీరామా
భగణము ు । । రాముడు

| | | |
|---|---|---|
| జగణము | । ∪ । | మురారి |
| సగణము | । । ∪ | అతనిన్ |
| నగణము | । । । | అతఁడు |
| యగణము | । ∪ ∪ | తనంతన్ |
| రగణము | ∪ । ∪ | వానితో |
| తగణము | ∪ ∪ । | కంసారి |

వీనిని సులువుగా గుర్తించుటకు "య మా తా రా జ భా న స ల గం" అను చక్రము నుపయోగింపవచ్చును. ఏగణము కావలసిన ఆ యక్షరమునుండి మూడక్షరములను గణించిన ఆ గణము ఏర్పడును. యగణము కావలయు నను కొందము. అపుడు "య మా తా" గణింతుము । ∪ ∪. అట్లే తగణము కావలసిన "తా రా జ" ∪ ∪ । అని గణింతుము.

సూర్యగణము లని, యింద్రగణము లని ఉపగణములు రెండురకములు.

నగణము । । । గలము ∪ । ఈ రెండును సూర్యగణములు. గలమును హాగణ మనియు అందురు.

| | |
|---|---|
| నలము | । । । । |
| నగము | । । । ∪ |
| సలము | । । ∪ । |
| భగణము | ∪ । । |

రగణము ౮ । ౮

తగణము ౮ ౮ ।

పై ఆరును ఇంద్రగణములు. గురువునకు "గ" యనియు, లఘువునకు "ల" యనియు సంజ్ఞలు. న + ల = నలము—। । ।+।; న+గ=నగము — । । । + ౮; స + ల = సలము— । । ౮+। అని గ్రహింపనగును.

## త్రి మా త్రా గ ణ ము లు

మూడు మాత్ర లుండు గణములు.

| | |
|---|---|
| । । । | నగణము |
| ౮ । | గలము (హగణము) |
| । ౮ | లగము (వగణము) |

## చ తు ర్మా త్రా గ ణ ము లు

నాలుగు మాత్ర లుండు గణములు.

| | |
|---|---|
| ౮ । । | భగణము |
| । ౮ । | జగణము |
| । । ౮ | సగణము |
| ౮ ౮ | గగము |
| । । । । | నలము |

## పంచమాత్రా గణములు

ఐదు మాత్రలు ఉండు గణములు.

| | |
|---|---|
| । ∪ ∪ | యగణము |
| ∪ । ∪ | రగణము |
| ∪ ∪ । | తగణము |
| । । । ∪ | నగము |
| । । ∪ । | సలము |

## యతి

పద్యపాదమున మధ్య విశ్రాంతి యుండును; దీనిని విరతి, విరామము, విశ్రామము, యతి అందురు. సంస్కృతముననైనచో పదము అక్కడకు తెగిపోయి, యతిస్థానమున క్రొత్తపదము మొదలగును. తెలుగున అట్లుకాక మొదటి యక్షరమునకు మిత్రాక్షరము యతిస్థానమున నుండును. యతికి స్వరము ప్రధానము.

## ప్రాస

పద్యపాదమున మొదటినుండి రెండవయక్షరమును ప్రాస యందురు. ఇది నాలుగుపాదములందు నొక్కటే యుండును. ప్రాసయందు వ్యంజనము ప్రధానము. ప్రాసాక్షరమునకు ముందు దీర్ఘమున్న నాలుగుపాదములందు దీర్ఘమే యుండవలయును. హ్రస్వమున్న హ్రస్వమే యుండవలయును.

## కందము

కందపద్యమున గగము, భగణము, జగణము, సగణము, నలము—అను గణము లుండును. ఒకటి మూడు పాదములందు మూఁడేసి గణములు, రెండు నాలుగు పాదములందు ఐదేసి గణములు నుండును. ఇవియన్నియు చతుర్మాత్రాగణములు. యతి రెండు నాలుగు పాదములందు నాలుగవగణము మొదటియక్షరముపై నుండును. బేసిగణముగా జగణము ఉండరాదు. యతికి ముందరిగణము జగణము కాని, నలము కాని కావలయును. రెండు నాలుగు పాదముల చివర గురువు ఉండవలెను. ప్రాసనియమము కలదు. ఉదా:—

"లలితజటాజినకుశవ
ల్కలధరులై వేద మొప్పఁగాఁ జదువుచు ని
మ్మల బ్రహ్మచారి వృత్తిని
వెలయఁగ నం దుండి రొక్కవిప్రగృహమునన్."

చివరిపాదమునకు లక్షణము నన్వయింతము.

వెలయఁగ నందుం డిరొక్క విప్రగృ హమునన్

| | | | | |
|---|---|---|---|---|
| I I I I | U U | I U I | U I I | I I U |
| నల | గగ | జ | భ | స |

ఇందు నలము, గగము, జగణము, భగణము, సగణము నున్నవి. మొదటియక్షరమగు "వె" కును నాలుగవ

గణమున మొదటి యక్షరమగు "వి" కిని యతి చెల్లినది. యతికి ముందరిగణము జగణము. పాదాంతమున గురువు కలదు.

## తేటగీతి

ప్రతిపాదమున ఒక సూర్యగణము, రెండు ఇంద్రగణములు, రెండు సూర్యగణములు నుండును. యతి నాలుగవ గణము మొదటి యక్షరముపై నుండును. ప్రాసనియమము లేదు. కనుక ప్రాసయతి చెల్లును. ఉదా :-

"బాలకుం డొక కొండుకకోల చేతఁ
బట్టికొని యేన రక్కసుఁ గిట్టి చంపి
చులుక వత్తు మీ రడలఁగ వలవ దనుచుఁ
గలయ నూరార్చెఁ దన తొక్కు పలుకు లొప్ప."

చివరిపాదమునకు లక్షణము నన్వయింతము-

కలయ నూరార్చెఁ దనతొక్కు పలుకు లొప్ప

| | | | U U | | | U | | | | | U | |
|---|---|---|---|---|
| న | త | సల | న | గల |

మొదటిగణము "న" గణము-సూర్యగణము; తరువాతి రెండును తగణము, సలము-ఇంద్రగణములు; తరువాతి రెండును నగణము, గలము-సూర్యగణములు.

యతి నాలుగవగణము మొదటియక్షరముపై నుండవలయును. ఇక్కడ "కలయ" లో పాదాదిద్వితీయాక్షరము "ల". యతిస్థానమున ద్వితీయాక్షరము "పలుకు" లోని "లు". కావున ప్రాసయతి చెల్లినది.

## ఆ ట వె ల ది

ఒకటి మూడు పాదములందు మూడు సూర్యగణములు, రెండు ఇంద్రగణములు నుండును. రెండు నాలుగు పాదము లందు ఐదు సూర్యగణము లుండును. ప్రతిపాదమునను యతి నాలుగవగణము మొదటియక్షరముపై నుండును. ప్రాసనియ మము లేదు; ప్రాసయతి చెల్లును. ఉదా :-

"సతి విముక్త యయిన పతికిఁ బునర్దార
సంగ్రహంబు సేఁత శాస్త్రమతము
పతివిముక్త యయిన సతి కన్యపురుషసం
గ్రహముసేఁత లోకగర్హితంబు."

చివరి రెండు పాదములకు లక్షణము నన్వాయింతము-

పతివి ముక్త యయిన సతికన్య పురుషసం

| | |  U |  | | |  | | U |  | | | U

న  గల  న  సల  నగ

వరుసగా నగణము, గలము, నగణము అను మూడు సూర్య గణములు; సలము, నగము అను రెండు ఇంద్రగణములు గలవు, "పతి" లో ద్వితీయాక్షరము "త" కారము—యతి స్థానమున ద్వితీయాక్షరమున "సతి" లోని "త" కారము. కావున ప్రాసయతి. ఇది బేసిపాదము.

గ్రహము సేఁత లోక గర్హి తంబు

| | |  U |  U |  U |  U |

న  గల  గల  గల  గల

ఒక నగణము, నాలుగు గలములు— అను ఐదు సూర్యగణ ములు గలవు. మొదటి యక్షరమయిన "గ" వర్ణమునకు నాలుగవ గణము మొదటియక్షర మైన "గ" వర్ణమునకు యతి చెల్లినది.

## సీ స ము

సీసమునకు నాలుగు పాదము లుండును. ఒక్కొక్క పాదము రెండేసిభాగము లగును. ప్రతిపాదమున మొదటి భాగమునందు నాలుగు ఇంద్రగణములు, రెండవ భాగము నందు రెండు ఇంద్రగణములు, రెండు సూర్యగణములు నుండును. ప్రతిభాగమునను మూడవగణము మొదటి యక్షరముపై యతి. ప్రాసయతి చెల్లును సీసము నాలుగుపాదము లయినపిమ్మట ఎత్తుగీతిగా తేటగీతి కాని ఆటవెలది కాని యుండును.

ఇతనివి క్రమమాశ్ర యించియ కాదెయ

I I I U I I U I U I I U I U

నగ సల భ ర

య్యేడలక్క యిల్లువె ల్వడఁగఁ గంటి

I I U I U I U I I I U I

సల ర న గల

ఇందు మొదటిభాగమున నగము, సలము, భగణము, రగ ణము అను నాలు గింద్రగణములు గలవు. రెండవభాగమున

సలము, రగణము— అను రెం డింద్రగణములు; నగణము, గలము—అను రెండు సూర్యగణములు గలవు. మొదటిభాగ మున మొదటి యక్షరమగు "ఇ" కి మూడవగణము మొదటి యక్షరమగు "యి" కి యతి చెల్లినది. రెండవభాగమున రెండవ యక్షరమైన "డ" కు యతిస్థానమునకు రెండవ యక్ష రమయిన "డ" తో ప్రాసయతి చెల్లినది.

## ద్వి ప ద

ద్విపదకు రెండు పాదము లుండును. ప్రతిపాదమునను మూ డింద్రగణములు, ఒక సూర్యగణము నుండును. యతి మూడవగణము మొదటియక్షరముపై నుండును. ప్రాసనియ మము కలదు— కాని ప్రాసయతి చెల్లదు. రెండుపాదముల కంటె ఎక్కువగా నున్నచో "ద్విపదమాలిక" యందురు. అదే రెండుపాదములకంటె ఎక్కువగానుండి ప్రాసనియమము పాటింపనిచో "మంజరి" అందురు. మంజరికి ప్రాసయతి చెల్లును. ఉదా:—

"శ్రీ కామినీనాథు జితదైత్యనాథు
లోకరక్షణకృత్యు లోకైకనిత్యు"

మొదటిపాదమున తగణము, తగణము, సలము— అను మూడు ఇంద్రగణములు; గలము అను ఒక సూర్యగణమును గలవు. మూడవగణము మొదటియక్షరమైన "జి" తో పాదమున

మొదటియక్షరమైన "(శ్రీ)"కి యతి చెల్లును. దీర్ఘపూర్వక మైన "క" వర్ణము ప్రాస. ద్విపద రెండుపాదములు కలిసి "తరువోజ" ఒకపాద మగును. అపుడు పాదమున మొదటి యక్షరమునకు మూడవగణము, ఐదవగణము, ఏడవగణము మొదటి యక్షరములపై యతి చెల్లును.

## ము త్యా ల స ర ము

ముత్యాలసరమునకు నాలుగు పాదము లుండును. మొదటి మూడు పాదములందు పదునాలుగేసి మాత్రలుండును. నాలుగవపాదమున తొమ్మిది కాని పదునొకండు కాని మాత్ర లుండును. ఒకటి రెండు పాదములకు, మూడు నాలుగు పాద ములకు వేర్వేరుగా యతిని గాని ప్రాసను గాని పాటింతురు. నాలుగవగణము చివర మకారద్విత్వము వచ్చినయెడల ఒక లఘువు తగ్గుటయును కలదు. ఉదా :-

"కావిమును గల్గాడ వేకువ
కాంత దివసాంగణము చేరెను
గాలిలో వనపాళిలో సుమ
గంధ మలమికొనెన్."

గురువునకు రెండు మాత్రలు; లఘువునకు ఒక మాత్ర. అట్లు గణింపగా మొదటి మూడుపాదములందు పదునాలుగేసి మాత్రలు గలవు. మొదటిపాదము మొదటి యక్షరము "కా"

కును ద్వితీయపాదము మొదటి యక్షరము "కాం' కును యతి. అట్లే మూడు నాలుగు పాదములందును—

"దేవళమ్ముల మొరసె జయఘం
టావితానమ్ము"

ఇచ్చట నాలుగవ పాదమునందు ఎనిమిదిమాత్రలే కలవు. మూడు నాలుగు పాదములకు ప్రాస కలదు.

## చ ం ప క మా ల

ఇందు న, జ, భ, జ, జ, జ, ర- అను గణములు వరుసగా నుండును. పదునొకండవ యక్షరముపై యతి యుండును. ప్రాసనియమము గలదు. ప్రాసయతి చెల్లదు.

"ఆరయఁగ భక్తవత్సలుఁడ వట్లగు టంగృప తోడమే దినీ"

I I I I U I U I I I U I I U I I U I U I U I U

ఇందు న, జ, భ, జ, జ, జ, ర- అను గణములున్నవి. పదునొకండవ యక్షరమగు "అ"కు యతి చెల్లును.

పై పాదమునందలి మొదటి రెండు లఘువులను ఒక గురువుగా చేసినచో ఆ పద్యపాదము ఉత్పలమాలా పద్య పాదమగును.

"ఆరయ భక్తవత్సలుఁడ వట్లగు టంగృప తోడమే దినీ"

U I I U I U I I I U I I U I I U I U I U

ఇప్పుడు ఈ ఉత్పలమాలా పాదమునందలి గణము లివి-భ, ర, న, భ, భ, ర, యను గణములు నొక వగణము ( ၊ ∪ ) ను ఉండును. ప్రతి పాదమున నిట్లే క్రమముగా నుండును. యతి మొదటి యక్షరమునకు పదవ యక్షరమునకు చెల్లును.

## మ త్తే భ ము

ఇందు స, భ, ర, న, మ, య- అను గణములు నొక వగణము (၊ ∪) ను ఉండును. పదునాల్గవ యక్షరముపై యతి చెల్లును. ప్రాసనియమము కలదు. ప్రాసయతి చెల్లదు.

"వినుపీ థిం బఱ తెంచినే లఁబడ నా వేగంబు నున్ నిల్పనో"

၊ ၊ ∪ ∪ ၊ ၊ ∪ ၊ ∪ ၊ ၊ ၊ ∪ ∪ ∪ ၊ ∪ ∩ ၊ ∪

ఇందు స, భ, ర, న, మ, య, వ- అను గణము లున్నవి. మొదటి యక్షరమగు "వి"కి పదునాల్గవ యక్షరమగు "వే"తో యతి చెల్లినది.

పై పాదమునందలి మొదటి రెండు లఘువులను ఒక గురువుగా మార్చిన, అది శార్దూల పద్యపాద మగును.

"విన్వీథిం బఱ తెం చి నేలఁ బడ నా వేగంబు నున్ నిల్ప నో"

∪ ∪ ∪ ၊ ၊ ∪ ၊ ∪ ၊ ၊ ၊ ∪ ∪ ∪ ၊ ∪ ∪ ၊ ∪

ఇప్పుడు శార్దూల పద్యపాదమున మ, స, జ, స, త, త- అను గణములును- ఒక గురువును ఉన్నవి. ప్రతిపాదమునను ఇట్లే క్రమముగా నుండును. యతి మొదటి యక్షరమునకును, పదుమూడవ యక్షరమునకును చెల్లును.

## అలంకారములు

కావ్యసరస్వతికి అలంకారములు అలంకారముల వంటివి. అలంకారములు అవయవములయందుండి శోభ నొసగుచు అవయవికి ఉపస్కారకము లగును. ఈ అలంకారములు శబ్దార్థములను ఆశ్రయించుకొని యుండును. శబ్దములను ఆశ్రయించుకొన్నవి శబ్దాలంకారములు; అర్థములను ఆశ్రయించుకొన్నవి అర్థాలంకారములు. శబ్దార్థముల రెంటిని ఆశ్రయించుకొన్నవి ఉభయాలంకారములు.

ఇప్పుడు అర్థాలంకారము లయిన ఉపమ, రూపకము, ఉత్ప్రేక్ష, అతిశయోక్తి, అర్థాంతరన్యాసము, స్వభావోక్తి అనువానిని గూర్చి తెలిసికొందము.

౧. ఉపమ:- ఒక వస్తువునకు మఱొక వస్తువుతో సాదృశ్యమును సుందరముగా చెప్పిన ఉపమాలంకారము అగును.

ఇందు ఉపమేయము, ఉపమానము, సమానధర్మము, ఉపమావాచకము- అను నాలు గంశము లుండును.

ఉపమేయము-ప్రస్తుతమగు విషయము.

ఉపమానము-అప్రస్తుతము.

సమానధర్మము- ఉపమానోపమేయములకు గల సామ్యము.

ఉపమావాచకము- సామ్యమును దెల్పు శబ్దము.

"నీ ముఖము కాంతిచేత చంద్రబింబము వలె నున్నది."

పై వాక్యమున ముఖము-ఉపమేయము; చంద్రబింబము-ఉపమానము; కాంతి-సమానధర్మము; వలె-ఉపమావాచకము.

౨. రూపకము :- ఉపమానమును ఉపమేయమునందు ఆరోపించిన రూపకాలంకారము అగును.

ఉపమేయమును విషయము అనియు, ఉపమానమును విషయి అనియు అందురు.

"నీ ముఖచంద్రుఁడు కాంతితోఁ బ్రకాశించుచున్నాఁడు."

పై వాక్యమున ముఖచంద్రుఁడు అనుదానియందు ముఖము విషయము; చంద్రుడు విషయి. చంద్రారోపమువలన ముఖమునకు ఉపరంజనము కలుగుచున్నది. ప్రకృతమునందు ఆరోపింపబడు అప్రకృతము ప్రకృతమునకు రూపసంపాదకమై ఉపరంజనము చేయుచున్నది

3. ఉత్ప్రేక్ష :- ఉత్ప్రేక్ష యనగా ఊహ యని యర్థము. కవి ఊహను తెల్పునది ఉత్ప్రేక్షాలంకారము. ఉపమాన ధర్మములు ఉపమేయమునం దుండుటకు వీలయినప్పుడు అట్టి ధర్మముల ననుసరించి ఉపమేయమును ఉపమానముగ నూహించిన ఉత్ప్రేక్షాలంకార మగును. అది హేతువస్తుఫలములను బట్టి మూడు విధములు.

"నీ ముఖశోభకై చంద్రుఁడు పద్మములతోఁ బోరాడుచున్నాఁడు."

చంద్రునకుఁ బద్మములకుఁ బోరాటము స్వాభావికము. కవి తన ఊహవలన దాని కొక ఫలమును గల్పించుచున్నాఁడు.

ఫలము కానిదానిని ఫలముగా చెప్పుటవలన ఇది ఫలో
త్ప్రేక్ష.

ఇచట ముఖము ఉపమేయము; చంద్రుడు ఉపమానము.

ఇట్లే కానిదానిని ఒక వస్తువుగా చెప్పుట వస్తూత్ప్రేక్ష. హేతువు కానిదానిని హేతువుగా చెప్పుట హేతూత్ప్రేక్ష. సాధారణముగా "తలంతును, భావింతును, అనఁగా" మున్నగు పదములు ప్రయుక్తము లగును. ఇట్టి పదములవలన ఉపమాన వస్తువునకు సత్యత్వము సమర్థితమై, అధ్యవసాయము సాధ్య మైనప్పుడు ఉత్ప్రేక్ష యగును.

౪. అతిశయోక్తి:- అధ్యవసాయమునకు ప్రాధాన్యమున్న చో అతిశయోక్తి యగును. ఉపమానమును ఉపమేయమును జెప్పవలసియుండగా, ఒక్క ఉపమానమునే చెప్పి ఉపమానోప మేయములకు అభేదమును గల్పించుట అధ్యవసాయము. ఉత్ప్రేక్షయందు అధ్యవసాయము సాధ్యము. అతిశయోక్తి యందు సిద్ధము.

"నల్లగలువల జంటనుండి వాడి బాణములు వెలువడు చున్నవి."

నల్లగలువలు - ఉపమానము; కన్నులు - ఉపమేయము. ఉపమేయమును చెప్పకుండ ఉపమానమునుమాత్రమే చెప్పి, ఉపమానోపమేయములకు అభేదమును సాధించినాడు కవి.

కవి ప్రౌఢోక్తికూడ అతిశయోక్తి యగును. ప్రౌఢోక్తి అనగా లోకసిద్ధమగు వస్తువును అతిక్రమించి చెప్పుట.

"సౌధాగ్రమున చంద్రమండలము భాసించుచున్నది."
సౌధాగ్రమునకు చంద్రమండలమునకు సంబంధము లేదు. ఉన్న దని లోకాతీతముగా చెప్పుటవలన అతిశయోక్తి యగుచున్నది.

౫. అర్థాంతరన్యాసము- సామాన్యమును విశేషముచే గాని, విశేషమును సామాన్యముచేగాని సమర్థించిన అర్థాంతర న్యాసాలంకార మగును.

"ఆంజనేయుఁ డబ్ధిని లంఘించెను. మహాత్ములకు దుష్కరము లేదు కదా!"

ఆంజనేయు డబ్ధిని లంఘించె నను విషయము విశేషము. మహాత్ములకు దుష్కరము లేకుండుట సామాన్యము. ఇచట సామాన్యవిషయముచే విశేషవిషయము సమర్థింపబడినది.

౬. స్వభావోక్తి :- జాతిగుణ క్రియా ద్రవ్యములను స్వభావసిద్ధముగా, సుందరముగా వర్ణించిన స్వభావోక్తి యగును.

"కృష్ణసారము మెడత్రిప్పి మనోహరముగా మాటి మాటికి రథమువంకఁ జూచుచు, బాణపతనభీతివలన ముందటి శరీరమును ముడుచుకొనుచు, నర్ధావలీఢములయిన దర్భ లాయాసముచేత నోటినుండి మార్గము వెంబడి జాఱుచుండ, భూమిపైఁ గాళ్ళు నిలుపక పెద్ద పెద్ద దాఁటులతో నెక్కువగా మింట నెగురుచున్నది."

పై వాక్యమున భయపడిన కృష్ణమృగముయొక్క చేష్టాదికము స్వభావసుందరముగా వర్ణింపఁబడిది.

---

# సంస్కృత సంధులు

సంధిపరిచ్ఛేదమున రెండు తెలుగు పదములకు నడుమ జరిగిన సంధికార్యములను చూచితిమి. రెండు సంస్కృత పదములకు నడుమ జరుగు సంధికార్యములను గ్రహించుటకు సంస్కృత వ్యాకరణమే ఆధారము. అందలి కొన్నివిధుల నిక్కడ నిరూపింతుము.

## ౧. సవర్ణదీర్ఘ సంధి

అ ఇ ఉ ఋ వర్ణంబులకు సవర్ణంబులు పరంబు లగునపుడు దీర్ఘం బేకాదేశం బగు.

ధర్మ + అర్జునులు = ధర్మార్జునులు
మహా + అనురాగము = మహానురాగము
దుఃఖ + ఆవహము = దుఃఖావహము
మహా + ఆహవము = మహాహవము
ముని + ఇంద్రుఁడు = మునీంద్రుఁడు
ధరణీ + ఈశులు = ధరణీశులు
గురు + ఉపదేశము = గురూపదేశము
పితృ + ఋణము = పితౄణము

వివరణ:- అ ఇ ఉ ఋ లకు అ ఇ ఉ ఋ లు సవర్ణములు. హ్రస్వము కాని దీర్ఘము కాని యైన అ ఇ ఉ ఋ అను నక్షరములకు హ్రస్వము కాని దీర్ఘము కాని యైన అ ఇ ఉ ఋ

అను అక్షరములు పరము అగునప్పుడు రెండింటికి బదులుగా నొక దీర్ఘాక్షరము వచ్చును.

ధర్మార్జునులు - ఇచ్చట అత్తునకు అత్తు పరమైనది. ఆదేశముగా అకారదీర్ఘము వచ్చినది. ధర్మ అను శబ్దమునకు చివరనున్న అత్తునకు, అర్జున శబ్దమునకు మొదటనున్న అత్తునకు బదులుగా ఒకే "ఆ" అను వక్షరము వచ్చినది. అందు వల్లనే సూత్రమున ఏకాదేశమనుట.

మహానురాగము-అచ్చట ఆత్తునకు అత్తు పరమైనది.

ఇట్లే తక్కినవి గ్రహింపుము

## ౨. గుణసంధి

అ కారమునకు ఇ ఉ ఋ వర్ణంబులు పరంబు లగునపుడు ఏ ఓ అర్ లు వరుసగా ఏకాదేశంబు లగు.

అమర + ఇంద్రుడు = అమరేంద్రుడు
సుర + ఈశ్వరుడు = సురేశ్వరుడు
పరమ + ఉపకారి = పరమోపకారి
గంగా + ఉదకము = గంగోదకము
వసంత + ఋతువు = వసంతర్తువు
శాంతా + ఋష్యశృంగులు = శాంతర్ష్యశృంగులు.

వివరణ :- గుణము అనగా ఇ ఉ ఋ వర్ణములు అ కారముతో కలిసి ఏ ఓ అర్ లు అగుట.

అ ఆ లకు ఇ ఈలు పరమగునపుడు ఏ;
ఉ ఊలు పరమగునపుడు ఓ;
ఋ ౠలు పరమగునపుడు అర్;

అనునవి ఏకాదేశముగా నగునని యర్థము.

అమరేంద్రుడు- ఇచ్చట అత్తునకు ఇత్తు పరమైనది. రెండింటి స్థానమున ఏ ఆదేశమైనది.

అట్లే తక్కినవి గ్రహింపుము.

### ౩. వృద్ధి సంధి

ఏ ఐలు ఓ ఔలు పరంబు లగునపుడు అకారంబు నకు వరుసగా ఐ ఔలు ఏకాదేశంబగు.

వన + ఓకసము = వనౌకసము
మహా + ఔద్ధత్యము = మహౌద్ధత్యము
లోక + ఏకబలుడు = లోకైకబలుడు
సమాజ + ఐక్యము = సమాజైక్యము

వివరణ :-వృద్ధి యనగా అకారముతో కలిసి ఏ ఐలు ఐ అగుట; ఓ ఔలు ఔ అగుట.

అ ఆ లకు ఏ కాని ఐ కాని పరమైన ఐ
ఓ కాని ఔ కాని పరమైన ఔ-

అనునవి ఏకాదేశముగా నగునని యర్థము.

వనౌకసము—ఇచ్చట అత్తునకు ఓ పరమైనది. రెండింటికి బదులుగా ఔ ఆదేశమైనది.

మహా+ఔద్ధత్యము— ఇచ్చట ఆత్తునకు ఔ పరమైనది. రెండింటి స్థానమున ఔ ఆదేశమైనది.

ఇట్లే తక్కినవి గ్రహింపుము.

## ౪. యణాదేశసంధి

ఇ ఉ ఋ ఌ వర్ణంబులకు తద్భిన్నస్వరంబులు పరంబు లగునపుడు వరుసగా య వ ర ల వర్ణంబు లాదేశంబు లగు.

| | | | | |
|---|---|---|---|---|
| ప్రతి | + | ఆగమనము | = | ప్రత్యాగమనము |
| గురు | + | ఆదేశము | = | గుర్వాదేశము |
| పితృ | + | ఆజ్ఞ | = | పిత్రాజ్ఞ |
| ఌ | + | ఆకారము | = | లాకారము |

వివరణ :- యణ్ణులు ఆదేశముగా వచ్చుట యణాదేశము. హయవరట్, లణ్ అను మాహేశ్వరసూత్రములందు ప్రత్యాహార ప్రక్రియనుబట్టి "యణ్" అనగా "య వ ర ల" అను నాలుగు వర్ణములును అర్థమగును. హ్రస్వదీర్ఘము లయిన ఇ ఉ ఋ ఌ వర్ణములకు వానికి భిన్నము లయిన అచ్చులు పరమందుండగా క్రమముగా యు, వ, ర, ల అను హల్లులు ఆదేశమగును. ఇ ఉ ఋ వర్ణములకు అవేవర్ణములు పర

మగుట సవర్ణదీర్ఘసంధి. యణాదేశము సవర్ణదీర్ఘమునకు విరుద్ధమైనది.

ఇ ఈ లకు ఇ ఈలు తప్ప మరే అచ్చులు పరమైనను "య్" ఆదేశముగా నగును.

ఉ ఊ లకు ఉ ఊలు తప్ప మరే అచ్చులు పరమైనను "వ్"

ఋ ౠ లకు ఋ ౠలు తప్ప మరే అచ్చులు పరమైనను "ర్"

ఌ ౡలకు ఌ ౡలు తప్ప మరే అచ్చులు పరమైనను "ల్" ఆదేశముగా నగునని యర్థము.

ప్రత్యాగమనము- ప్రతి + ఆగమనము

ఇత్తునకు తద్భిన్నమైన "ఆ" పరమైనది. "య్" ఆదేశమైనది.

ప్రత్ + య్ + ఆగమనము

యకారమునకు ఆకారమునకు సన్నికర్షవలన "యా" ఐనది. ప్రత్యాగమనము అను రూపము సిద్ధించినది.

ఇట్లే తక్కినవి గ్రహింపుము.

---

# సంజ్ఞల వివరణము

౧. ఉపధ : ఉపధయనఁగాఁ దుదివర్ణమునకుముందు వర్ణము. రోచి అను పదమునందు చివరివర్ణము "ఇ". దానికి ముందరివర్ణము "చ" కారము. అందువలన "చ్" అనునది ఉపధ యనబడును.

౨. తద్ధర్మార్థకము : క్రియయొక్క ధర్మమును బోధించు రూపము. వచ్చునుఅనునది "వచ్చు" అను క్రియాధాతువు యొక్క ధర్మమునే బోధించును. ప్రత్యేకముగా ఏ కాలమును నిర్దేశింపదు.

౩. శత్రర్థకము : వర్తమానకాలమును బోధించు అసమాపక క్రియారూపము. వచ్చుచున్—అను రూపమున "చు" అను ప్రత్యయము వర్తమానార్థమును బోధించుచున్నది.

౪. తుమర్థకము : సంస్కృతమున గంతుమ్, భోక్తుమ్ మున్నగు రూపములందున్న ప్రత్యయము " తుమ్ ". దీనికి "కొరకు" అని అర్థము. తెలుగున "కొరకు" అను నర్థమును బోధించు రూపములను తుమర్థకము లందురు. కొట్టన్-కొట్టఁగన్. కొట్టుటకొరకు అని యర్థము.

౫. ఆనంతర్యార్థకము : అనంతరమునందు జరిగిన పనిని బోధించు రూపము. కొట్టుడున్ అనగా కొట్టిన తరువాత అని యర్థము.

౬. చేదర్థకము ! సంస్కృతమున "అయినచో" అను నర్థమున "చేత్" అని ఉపయోగింతురు. కొట్టినన్ అనగా కొట్టినట్లయినచో అని యర్థము. కావున చేదర్థకము.

౭. వికల్పము : ఒకమారగుట ఒకమారు కాకుండుట వికల్పము అనబడును. అడఁకువ అను పదమున అర్ధానుస్వారమునకు పూర్ణబిందువు వికల్పముగా నగును. అయినచో అడంకువ అను రూపము, కాకున్న అడఁకువ అనురూపము.

౮. బహుళము : బహుళమనగా అనేకవిధములుగా నని యర్థము. కాని వ్యాకర్తలు ప్రవృత్తి, అప్రవృత్తి, విభాష, అన్యత్వము అని నాలుగువిధములుగా చెప్పిరి. ప్రవృత్తియనగా నిత్యముగా వచ్చుట; అప్రవృత్తియనగా నిత్యముగా రాకుండుట; విభాష యనగా వచ్చుటయు రాకుండుటయు రెండును అగుట; అన్యత్వము అనగా మరొక సూత్రము వర్తించుట వలన వేరు విధముగా అగుట. [ఉదాహరణమునకు గసడద వాదేశ విషయము చూడుము.]

౯. సంధి : పూర్వ పరస్వరంబులకుం బరస్వరం బేకాదేశంబగుట సంధియనంబడు. రాముఁడు+అతఁడు. పూర్వాచ్చు

ఉత్తు. పరమందున్న అచ్చు అత్తు. ఈ రెండింటి స్థానమున పరమందున్న అచ్చు వచ్చినది. రాముఁ డతఁడు-అని యైనది.

౧౦. ఆగమము : ఆగమం బనగా వర్ణాధిక్యంబు. "మిత్ర వదాగమః" ఉన్నవర్ణము లుండగా అదనముగా వచ్చి చేరునది మా+ ఇల్లు-అనుచోట సంధి లేనందువలన యడాగమము. మా+య్+ఇల్లు=మాయిల్లు అయినది.

౧౧. ఆదేశము : ఉన్న వర్ణమును దొలగించి తత్స్థానమున వచ్చునది. "శత్రువ దాదేశః" కుఱు+ఉసురు—ఱకారమునకు ద్విరుక్తటకారము ఆదేశము కాగా కుట్టు+ఉసురు—కుట్టుసురు అయినది. "ఱ" వర్ణమును తొలగించి తత్ స్థానమున "ట్ట" నిలిచినది.

✓౧౨. క్త్వార్థకము : సంస్కృతమున గత్వా, పీత్వా మున్నగు క్రియారూపములందలి ప్రత్యయము "త్వా". వెళ్ళి, త్రాగి అని పై రూపముల కర్థములు. తెలుగున ఆ యర్థమున నున్న వానిని క్త్వార్థకము లని యందురు. ఇది భూతకాలికా సమాపక క్రియారూపము

౧౩. ఆమ్రేడితము : ద్విరుక్తముయొక్క పరరూపమామ్రేడిత మనంబడు. ఒకేమాటను రెండుమారు లుచ్చరించిన రెండవమా రుచ్చరించిన దాని నామ్రేడిత మందురు.

ఔర+ఔర$_2$—రెండవది ఆమ్రేడితము.

౧౪. అపదము: పదము కానిది అని యర్థము. ప్రకృతి ప్రత్యయముల కలయికవలన ఏర్పడి అర్థము కలిగియుండునది పదము. దానికి భిన్నమైనది అపదము. అవ, ఎఁడు మున్నగునవి ఉదాహరణలు.

౧౫. సంశ్లేషము : సంశ్లేషంబనగా మీఁది హల్లులతోఁ గూడికొనుట. పూచెను + గలువలు–ద్రుతమునకు సంశ్లేషము కాగా పూచెన్గలువలు - అని యగును.

౧౬. స్వత్వము : స్వత్వం బనగా ద్రుతంబునకుఁ బ్రకృతిభావము. ప్రకృతిభావ మనగా స్వాభావిక మగు రూపమని యర్థము. స్వత్వము గలుగగా 'పూచెను గలువలు' అను రూప మేర్పడును.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA123B187 |
| పుస్తకం పేరు | బాలవ్యాకరణము |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 141 |
| పెద్ద సైజు పేజీలు | |
| ఖాళీ పేజీలు | 34 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Nanda |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |